# సావిత్రీచిత్రాశ్వనాటకము

గ్రంధకర్త

ఆంధ్రనాటక పితామహ యను బిరుదువహించిన

## ధర్మవరం రామకృష్ణమాచార్యులు.

ఇది

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవలనఁ

ప్రకటింపబడియె.

నాల్గవ కూర్పు.





బళ్ళారి

భువనేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

---

1933

1-8-



[ క్రయము రూ. [redacted]

# విన్నపము

ఈనాటకము తొలుదొలుత ఆంధ్రనాటక పితామహుని జీవిత కాలములోనే ప్రచురింపఁబడెను. అప్పటికి రెండంకములలో మాత్రము పద్యములు వ్రాయఁబడి తీఱికలేమిచే మూఁడవ యంకమునఁ గట్టకడపటి పద్యమొక్కటి తక్క యితర పద్యములు వ్రాయఁబడవయ్యె. అందుచే నప్పుడు రెండంకములు మాత్రమే ప్రకటింపఁబడియుండెను. అతఁడు కీర్తిశేషుఁడైన తరువాత నీ నాటకమును బూర్తిగాఁ బ్రచురింపఁదలంపు గొన్నవారి సోదరుఁడగు కీ॥ శే॥ శేషాచార్యులవారు మూఁడవ యంకములలోని మిగిలిన పద్యముల వ్రాసిరి. అందుచే మొదటి రెండంకములలోని పద్యములకును మూఁడవ యంకములోని పద్యములకును నన్నివిధములఁ జాల దారతమ్యము పొడకట్టుచున్నది. ఇట్లని శ్రీ శేషాచార్యులవారు మొదటి కూర్పు పీఠికలోనే వ్రాసి యున్నారు. ఆ పీఠిక సంతయు నిపుడు ముద్రించు నావశ్యకత లేదని తోఁచినందునను, ఈనాటక పాఠకులు మూఁడవయంకములోని పద్యములు ఆంధ్రనాటకపితామహుఁడు వ్రాసినవి కావని తెలుసుకొనవలయుననియు నిట్లు విన్నవింప వలసి వచ్చెను. మొదటి రెండంకములలోని పద్యములును, మూఁడవ యంకములోని కట్టకడపటి పద్యమును మాత్రము ఆంధ్రనాటక పితామహుని వనియుఁ దక్కినవి అతనివి కావనియు నింకొకసారి పాఠకులకు విన్నవించుచున్నారము.

ప్రకాశకులు.

This book is approved by the Text book Committee and prescribed for the B. A. and Vidvan Examinations 1935 by the University of Madras.

ఈ నాటకము పాఠ్య గ్రంథ నిర్ణాయక సంఘము వారిచే కళాశాలోపయోగమునకై యామోదింపఁబడి మద్రాసు విశ్వ విద్యాలయపు (1935) బి. ఏ, మఱియు విద్వాన్ పరీక్షలకు పఠనీయ గ్రంథముగా నిర్ణయింపఁబడినది.



**Bellary. D. KRISHNAMA CHARLU**

"ANDHRA NATAKA PITHAMAHA"

Born 1853—Died 1912.

శ్రీ

# సావిత్రీచిత్రాశ్వ నాటకము

## ప్రస్తావన.

శా॥ శ్రీకాంతామణితొలనీవదననీ రేజంబు గన్గల్వల
వ్యాకోచస్థితిఁ జెందె హా తెలిసెనంచక్షుల్వెసన్మోడ్చి ర
మ్యాకోమ్మాళ్యుని డాయుచుం బ్రణయకోపాధీన నవ్వించి యం
గీకారంబునఁ గౌఁగిలించు హరి నేఁ గీర్తింతు నశ్రాంతమున్

అనుబంధము 1.

మ॥ అతివేలంబుగనష్టసిద్ధు లలదత్తాత్రేయుకారుణ్యమున్
అతులాత్మీయసహస్రబాహువులెయన్వర్థప్రథాచక్రవ
ర్తితయున్ జాటఁగనాశ్రితావళులయార్తిందోలికల్యాణసం
తతిఁ జేకూర్చెడు కార్తవీర్యుఁడసమౌదార్యుండు రాజిల్లెడున్.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు సభ్యుల నవలోకించి).

ఆహా! సకలకలాధారులగు నీసభాస్తారులిందు విజయముచేసియున్నారు. వీరి మనసు లలరింపఁజాలు నేదేని నాటకమును క్రీడింపవలయునని నాకభిలాషము జనియించె. అదె నటియు వచ్చుచున్నది. ఆలోచనచేసెద.

[ ప్రవేశము: నటి. ]

సూత్ర—నటీ! ఇటురమ్ము. నీయోజనతోఁగడునక్కఱకలిగిన యిక్కాలమున నీవరుదెంచితివి. మేలాయె.

నటి—ఆర్యా! ఎట్టివిషయములయందును బూర్ణానుభవము కలిమి నెల్లరకుపదేశింపఁగల నీవు నాయోజన నభిలషింపవలెనన్న నాభాగ్యవిశేషముగదా? అదియేవిషయము వచింపుము. ఈసభాసదులందఱేలచేరియున్నారు? ఇందఱు సతీమణులిందేల యున్నారు.

సూత్ర—వారికొఱకేకదా నీమంతనము నపేక్షించితి. పండితమండల మండనులైన యీ విద్వత్సభ్యులును, సముచితసాధ్వీమతల్లులైన యీతరుణీమణులును, నానందించు నేదేని నాటకమొక్కటిం బ్రదర్శించుతలంపు వొడముచున్నది. కాఁబట్టియే నిన్నుఁ గోరితి.

నటి—అయ్యో! అట్లయిన నాకు మిక్కిలి పరితాపమయ్యెడు.

సూత్ర—ఏల ?

## అనుబంధము 2.

నటి—హిమసన్నిపాతంబునఁ బ్రాణములు హరింపఁజాలుటచే హేమంతమను నన్వర్థ కాభిధానముఁజెందిన యీచలివేళఁ గుఱుచమంచములు, వెచ్చని పఱపులు, వేడికంబళులు, వెట్టకుంపటులుమాని వేమరులై యిందువచ్చియున్న యీ సతీపురుషులు మరలనిరాశులై వెనుకకుఁబోవలసివచ్చెనే యని.

సూత్ర—వీరు వెనుక కేలపోవలయు?

నటి—వీరెల్లఁజూచి సంతసింపఁజాలు నాటకముఁబ్రదర్శించుట మనకుసాధ్యమా ?

సూత్ర—అతివా! నీవుతప్పఁదలంచితివి. వీరు దోషజ్ఞులుగాని దోషైకదృక్కులుగారు. ఎంత స్వల్పగుణమున్నను దానికి సంతసించువారేకాని యితరముకాదు. వీరిని రంజించుట యెంతయు సుకరమని యరయలేకైతివే.

నటి—"వీరిని రంజించుట" యంటివే "వీరె" వరు? సతుల నంటివా పురుషులనంటివా?

సూత్ర—ఉభయులను.

నటి—ఇది కానిపని. చెప్పెదవినుము.

సీ. శృంగారరసము హెచ్చినయంతనొక వేళ
సతులకువెగటన్నసరణిఁదోఁచుఁ
గరుణారసంబువెగ్గలమైన నొక వేళఁ
బురుషులుగనలేమిఁబొసఁగఁజేయు
నపవర్గమార్గైకవిపులశాంతరసంబు
ప్రకృతకాలమునందు రసమెకాదు
వీరరౌద్రాద్భుతబీభత్సభీమముల్
దమయంతనాహ్లాదదములుగావు
తే. గీ. హాస్యవత్సలరసములత్యధికమాఢి
నిడఁగనీరసమగుభంగిఁగడకుఁదోఁచు
నీసతీపురుషులకెల్ల నింకముదము
నిచ్చునేకాదశరసంబదేదికలదొ.

సూత్ర—కామినీ! ఇట్టులేటికధైర్యముం జెందెదవు?

సీ. కడఁగిశృంగారప్రకాశంబుశృంగార
మొక్కటేరసమనె నుండనిమ్ము
అరసి "ఏకోరసఃకరుణఏవ" యటంచు
భవభూతియనెనదిప్రబలనిమ్ము

పదియునెన్మిదియుఁదొమ్మిదియనిరసముల
నూహించిరొకకొందఱుండనిమ్ము
రూఢి "లోకభిన్నరుచి" యంట నొకరసం
బెల్లవారికిరుచియింపఁగలదె
తే. గీ. యెల్లరసములించించుకపల్లవింపఁ
జెలఁగునాటకమలరింపఁగలదుగాదె
జనుల షడ్రసోపేతభోజనముకరణి
రమ్యమదియె యేకాదశరసముసుమ్ము.

నటి—అట్లయిన నిన్ని రసముల తెలసిన నాటకమెందుఁగలదు ?

సూత్ర—అదియే యోచించుచున్నాను.

నటి—అయిన నీవుయోచింపుము. నాకుఁజలిగానున్నది. నేఁబోయి పండుకొందును.

సూత్ర—నీయట్టి యుక్తిశాలినికిసయిత మాలోచనతోఁపనియ్యాని యీచలికాలమునింత వర్ణింపుము. ఇంతలోనే జ్ఞాపకమునకుఁదెచ్చుకొనియెద.

నటి—భాగ్యము. అయినవినుము.

ఉ. కాంతలపాదములొద్దలుతఁగాంచి క్రమంబున మోవికెక్కహే
మంతుఁడుకాయముల్వడఁక మాగతియేమనివెల్లఁబోవ—

సూత్ర—నిలుపుము. జ్ఞప్తికివచ్చె. సావిత్రీచిత్రాశ్వనాటకమని యొక యాంధ్రనాటకము కలదు. అదియైన నీవచ్చినవారికి ముదమునింపఁగలదని తోఁచుచున్నది.

నటి—ఎవరివలన రచియింపఁబడినది.

సూత్ర-చ॥ కలఁడుగదాగదాగ్రజనికస్వరభక్తియుతుండుకౌశికో
జ్జ్వలకులకృష్ణమార్యకవిపౌత్రుఁడు కృష్ణసుధీంద్రపుత్రుఁడ
త్యలఘువిధాన నాటకచయారచనానిపుణప్రథాప్రభా
వలలిత రామకృష్ణకవివర్యుఁడుదారకవిత్వధుర్యుఁడై.

నటి—(పైఁ కాంతలపాదము" లను పద్యముభాగముపూరలఁజదివి)
బాలొప్పంతలనాథులక్బిలువఁబొండనియించుకనవ్వఁజేసినై
నింతహాసంతియించునిహిహీయనఁజేసెపిదూషకుండనక్.

—: ఇది ప్రస్తావన :—

శ్రీ

# సావిత్రీచిత్రాశ్వనాటకము.

## ప్రథమాఙ్కము - ప్రథమరంగము.

### సాళ్వపురిలో ద్యుమత్సేనునికొలువుముందటి బయలు.

[ ప్రవేశము-సుమాలి యనువిదూషకుఁడు ].

సుమాలి—ఆహా! ఎట్టిసమయముగలిగె! ద్వాదశలక్షసైన్యముతో ఘటకేతుఁడు పురమును ముట్టడించియున్నాఁడు. ఎట్లుచేయుదమన్నను విధిలేకయున్నది. నన్నేల యీరాజు పిలిపించియున్నాఁడు? నే యుద్ధమాడఁబోవలయునా? ఏదేనిహాస్య ప్రసంగము గలిగినప్పుడు నేఁదలఁపునకు రావలయుఁగాక యిట్టివేళ నాతోఁ బనియేమి? యుద్ధముజరిగెనా మహోన్నతపదవి యబ్బినట్లు గొప్పవృక్షముపైఁ గూరుచుండి సమర వినోదములన్నియుఁ జూచి యొడలి జీరుకొకుండ వెడలివచ్చి యుద్ధము ముగిసెనని వేడుకగాఁగథ చెప్పవలయువాఁడఁగాక పనికిరానియుద్ధము నాకేల? అయినను జూచెద. (నిష్క్రమించును.)

(వెనుకయవనిక నెత్తగా ద్యుమత్సేనుఁడును జయదేవుఁడును నుందురు).

మంజుభాషిణీవృత్తము.

ద్యుమ—కరుణాలవంబుబోఁడగానమెట్టులో
నరితోడసంధిభయదాహవంబునన్
బరిమార్చుటొప్పుఁగెలువంగఁజాలుదున్
దిరమారఁగూర్పుజయదేవసేనలన్

జయ—రాజేంద్రా! నీయాజ్ఞకువేఱుకలదా? అయిన నింతయోచింపవలయుఁగదా? ఘటకేతుఁడు ద్వాదశలక్ష మహాసైన్యోపేతుఁడై యున్నవాఁడు. మనసైన్యము రెండులక్షలకంటె నెక్కువలేదు.

కం॥ అమరంగఁదారతమ్య
క్రమమరయక దేశకాలగతిఁగనకెదిరి౯
దముఁదెలియక చేటెఱుఁగని
సమరముసేయంగఁదగునె జగతీశులకు౯.

ద్యుమ—అయిన నెన్నిదినము లిట్లాలోచించుచుండవలయు? అయ్యో! నాచిత్రాశ్వుఁ డొకఁడున్న నాకీచింతయుండదుగదా?
జయ—అతనియెడకే సుమాలింబంప నెంచితివిగదా? చూతము.
ద్యుమ—ఎన్నిదినములకువచ్చునో యెట్లుసంఘటిల్లునో యెఱుఁగను.

[ ప్రవేశము: సుమాలి ]

సుమాలీ! రమ్ము. నీవునాకు మిక్కిలికూర్చువాఁడవు. అభిలాషవశంబున నూరక హాస్యోక్తులాడుచున్నందున విదూషకుఁడ వనిపించుకొంటివికాని మంత్రాలోచనముల్పచరించి యెట్టికార్యమునైన సాధింపఁజాలువాఁడవు.
సుమా—ఇంతస్తుతిచేయసాగితివి. నాకేమోభయమగుచున్నది. ఏమోయున్నది.
ద్యుమ—సుమాలీ! వింటివా ఘుటకేతుని కృత్యము?

ఇంద్రవజ్ర. ఈతీరుదైర్యాద్రికి నింద్రవజ్రం
బైతోఁచె శత్రుండిటులాక్రమించె౯
జేతోగతి౯ గుందుచునిన్సుమాలీ
నాతాపమార్పంగను నమ్మినాఁడ౯॥.

మా—వచ్చె. ఇంకెట్లుచేయుదు? రాజేంద్రా! ఇదినీకు ధర్మమా! ననుఁజంపి నందునన నీకేమైనఫలమా? బ్రహ్మహత్యరాదా?
ద్యుమ—అదేల? నీవుచావనేల?
సుమా—బ్రాహ్మణుఁడనైపంచాంగము వల్లించుచుఁ గుండలసందున నెందోపడియుండ వలసినవాఁడ.

సీ॥ పంచెచుట్టినప్రాఁతపంచాంగములగాఁక
ధనువునుడాకేలఁదాఁకియెఱుఁగ
విశదవిశ్వామిత్రకుశసంతతులఁగాక
బాణముల్వ్రేలకేలఁబట్టియెఱుఁగ

నాయవారపుగింజలణఁగుమూటలఁగాక
మూపునఁదూణినేమోసియెఱుఁగ
మఱివివాహశ్రాద్ధమంత్రముల్గా కస్త్ర
బృందమంత్రములుచ్చరించియెఱుఁగ
తే. గీ॥ భీష్మపార్థకుమారాదివీరవరుల
కదనభంగులఁగథలలోఁజదివిజనులు
బళి సెబాసనిపొగడనుపన్యసింతుఁ
గానికలనైనననిఁజూచినేనెఱుంగ॥

ఇట్టివాఁడనే యుద్ధమునకుఁదగుదునా ?

ద్యుమ—మిత్రమా ! నిన్నెవ్వరు యుద్ధమునకు నియమింపనెంచిరి ? యుద్ధమాడనుపక్రమించినను వెనుదీయుదువా ? అదికాదు. ద్వాదశలక్ష సైన్యముతో ఘటకేతుఁడు దండెత్తివచ్చియుండ నల్పికసైన్యముతో నేమిచేయుటకును దోఁచక చిత్రాశ్వుఁడు దండలేమిచేఁగలిగిన మనోజాడ్యమునకుఁ బ్రతిక్రియచేయ నిన్నుఁబిలిపించితి.

సుమా—ఇట్టిజాడ్యమునకు నేనొక్క మందెఱుంగుదు.

ద్యుమ—అదియేమి ?

సుమా—దేశాంతర ధారణమను ననుపానమునఁ బలాయన రసమింత సేవించినఁజాలు.

ద్యుమ—సుమాలీ ! ఇవియేటిమాటలు—మాచిత్రాశ్వుని నీ వెట్లయినను జేసి తోడుకొని రావలయు.

సుమా—వాఁడిప్పుడెక్కడనున్నాఁడు ?

ద్యుమ—ఇంకెక్కడనుండఁగలఁడు. మణిపురముననే మేనమామయూరనుండఁగలఁడు.

సుమా—ఆమణిపురరాజునకుఁ గూఁతురున్నది కదా ?

ద్యుమ—ఉన్నది. ఏల ?

సుమా—నవయౌవనకళాలోలుఁడగు నీకొడుకు పోవకపోవక మేనమామగారియూరికిఁ బోయియుండుటేమి. అక్కడ మేనమామకూఁతురుండుటేమి, ఇంతలోవచ్చుననఁగానేమి?

ద్యుమ—సుమాలీ! నీయూహయసమంజసము. ఆమెకప్పుడే పరిణయమైయున్నది.

సుమా—మణిపుర స్త్రీలు మిక్కిలి సౌందర్యవతులని వింటిని. మేనమామకూఁతురు లేకున్న నింకేమామకూఁతురున్నదో యౌవనవంతుఁడైయున్న రాకుమారునకు మామగారికేమితక్కువ ?

(లోపలఁగలకలము మంటయు)

ద్యుమ—అహో! ఏమీయద్భుతకలకలము ?

సుమా—(ఆవైపుఁజూచి) మిక్కిలివేడుక. అగ్నికి బహుప్రీతి—కోటిసూర్య ప్రకాశము—అందుకే యీవినోదధ్యానము.

జయ—రాజేంద్రా! కోటలోనికడనున్న పురభాగమునకెట్లో శాత్రవుడగ్ని నిడి యున్నాడు. జనులందఱు కలకలము చేయుచున్నారు.

ద్యుమ—జయదేవా! అయిన నీవుపొమ్ము. దానిఁజల్లార్పుటకుఁ బ్రయత్నింపుము.

(జయ-నిష్క్రమించును).

ద్యుమ—సుమాలీ! నీవెట్లయిన నీపురినిర్గమించి మణిపురమునకుఁబోయి నాసుతునింబిలిచి కొనిరావలయు.

సుమా—శత్రువులు ననుగుఱుతించినచో నెట్లు?

ద్యుమ—మాఱువేషమునఁబోవలయు. ఒకవేళ గుఱుతించినను బ్రాహ్మణుని నిస్సేమి చేయఁగలరు.

సుమా—మీసత్యవంతుడు మణిపురముననే యుండుననునిశ్చయమేమి?

ద్యుమ—ఇంకెందుండఁగలఁడు?

సుమా—ఉండినను వచ్చునా?

ద్యుమ—ఇట్టికష్టకార్యము సంభవించియుండ రాకపోవునా?

సుమా—నేను వినోదమున కీవార్త చెప్పితిననియెంచిన?

ద్యుమ—వినోదమున కంతదూరమురాఁగలవని యెంచునా? అంతయేల? నేనుజాబు యిచ్చెదను.

సుమా—ఆజాబుదారిలోనేఁ బోఁగొట్టుకొన్న?

(లోపల మరలఁగలకలము)

ద్యుమ—సుమాలీ! కలకల మింకను నెక్కువయ్యె. నేఁబోయెద. నీవాయితమొనరించి రమ్ము. (నిష్క్ర)

సుమా—ఈరాజుతనకొడుకు నొకనాఁడైన వెలికిఁ బంపినవాఁడుకాఁడు. ఇప్పుడు పంపియున్నాఁడు. ఇట్టికార్యముపొసఁగె. అచిత్రాశ్వుఁడెన్నిమారులో నాతో దేశముచూడవలయునని చెప్పుచుండె. ఇప్పుడు జనకుఁడాజ్ఞయివ్వఁబోయె. నిండు జవ్వనముబలమున మెఱయుచుఁ దలుగుఁదప్పించిన కోడెవలెఁజెలరేగి మనోహరయువతీసమూహమున నిండియున్న మణిపురముననున్న యారాచపట్టికెట్టి వార్తకొని పోవలనె! నేవచ్చునంతకిక్కడ నేమగునో?

కం॥ సరిలేనిసైన్యముననీ
పురమునుదానెల్లకడల ముట్టడివేసెఁ
బరరాజుసమరమైనక
హరిహరియాపిభునకెట్టియాపదగలదో॥

(నిష్క్ర)

## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.



### సాళ్వపురికోట.

కోటపైన ద్యుమత్సేనుఁడు సైన్యముతో
క్రింద ఘటకేతుఁడు సైన్యముతో నుందురు.

అనుబంధము ౩.

ఘట—సేనానీ! ఈశాత్రవుని దల్పిష్ఠసైన్యమైనను గోటబలంబున మనల నిన్నిదినంబులాఁపియున్నది. మనసైన్యము నేఁడిరుపాయలొనర్చి యీభాగమున నర్ధసైన్యమీయరులతోఁబోరాడుచుండ మిగిలినయర్ధము నావైపునకుఁబోయి యేభంగినైన నేఁడే సాలభేదన మొనర్పవలయు.

సేనాని—భాగ్యమట్లనే చేయుదును.

ఘట—(అర్ధసైన్యముతో నిష్క్రమించును.) (కోటపైనలబలము వోడమును. ఘటకేతుఁడు సైన్యముతోఁగోటమీఁదికిఁబోయి యందున్న ద్యుమత్సేనుని సైన్యమును జక్కాడి ద్యుమత్సేనుఁబట్టును. కోటవాకిండ్లు తెఱవఁబడును. ఘటకేతుని మిగిలిన సైన్యము కోటలోదూరును).

ఘట—(భుజపాదబద్ధుఁడైయున్న ద్యుమత్సేనునితో) ద్యుమత్సేనా! నీకొడుకు చిత్రాశ్వుఁడెక్కడనున్నాఁడు? నిక్కము చెప్పుము. ఏమిపలుకవు? చెప్పుము చిత్రాశ్వుఁడెందున్నాఁడు? చెప్పవా? సేనానీ! ఈనీచునిఁ జెఱయందునుంపుము. నాల్గుదినములవఱకు నాహారమేయుప్పింపకుము. అప్పటికైనఁజెప్పడేమోచూచెద. పురములోనను వెలివైపు నెల్లకడలఁ జిత్రాశ్వునిపాలఁకువ లరయఁబంపుము. వీనివారినెల్లఁ గారాగృహమునసునుంపుము. ద్యుమత్సేనా! ముమ్మాఱడిగెదను. చిత్రాశ్వుని వృత్తాంతము చెప్పవా? చెప్పవా? చెప్పవా; కానిమ్ము. నీకుఁజేయవలసిన విధానము వేఱున్నది. భటులారా! వీని నిచ్చోటనుండి కొనిపొండు.

(భటులు ద్యుమత్సేనునీడిచికొని పోవుదురు).

ఉ॥ విశ్వమునంతయున్వెదకి వేసటఁజెందక యెట్టులైనఁజి
త్రాశ్వునిఁబట్టి తెచ్చుటకు నాజ్ఞయొసంగి యొసంగఁబంపుమా
యాశ్వికరాజినింతజయమయ్యును వాఁడిటు చిక్కఁడేని సే
నేశ్వర వ్యర్థమా బ్రదుకనిచ్చుట చెల్లునె శత్రుశేషముఁ.

అదిగాక వాఁడు పరాక్రమాంచితుఁడనియు సమరాభీలుఁడనియు వింటిమి. సహాయ సంపదవానికిఁగలుగని యిట్టికాలమునఁబట్టమేని పిదప మనకుఁదొసఁగుఁదేనోపు. కావునఁ బరాకుపడక యీకార్యమొనరింపుము. (నిష్క్ర-)

---

## ప్రథమాఙ్కము-తృతీయరంగము.

---

మద్రపురికిఁ గొంచెముదూరముననున్న వనము.

[ ప్రవేశము: సావిత్రి, ఉత్పల. ]

అనుబంధము 4.

మధురగతి రగడ.

సావి— ఉద్యానవైభవము నుత్పలాకనుఁగొంటె
ప్రద్యోతమానతరులాజిరాజిలెఁగంటె
ఉత్ప— సావిత్రియిందుఁగలచల్లదనమబ్బురము
ఈవనంబునుతింపనెంతయును నబ్బురము
సావి— శుకవాణిచూచితివె సురసాలభూజంబు
నిఁకలేదుదీని కెనయిదివృక్షరాజంబు
ఉత్ప— ఈపండ్లుకడుఁగొప్పలేపారఁజూడంగ
బాపురేయనిపించె వలదోనియాడంగ
సావి— సొంపుమైఁగమనీయసుమదళవ్రాతముల
నింపారెఁజూచితివె యీపారిజాతముల
ఉత్ప— కన్నులంగవకునింపేఁగలికికడుమోదంబు
వన్నెన్నకలిగించె నద్భుతామోదంబు
సావి— కాకున్న నెత్తావికడిమిఁదమరంగముల
కాకర్షణముచేయు నామత్తభృంగముల
ఉత్ప— ఆడెయందుఁజూచితివె యబలమంజుల కేళి
రోదమీఱఁజనుదెంచె రోలంబఘనపాళి

సావి— యింపొంసమధురమైయెసఁగువాసనమించెఁ
జంపకంబిదియెంత సమ్మోదంబొనరించె
ఉత్ప— అచ్చమౌనామోద మలరిబహుభంగముల
నుచ్చాటనమొనర్చె నువిదయిదిభృంగముల
సావి— కనుఁగొంటెయెలనాఁగ కడుగొప్పతాలముల
వినువీధిఁగనిపించి వెలసెఫలజాలముల
ఉత్ప— సంబరంబనుమిద్దె నట్టెనిల్పినమేలి
కంబంబులనమించెఁ గాదెయీతరుపాలి
సావి— ననబోణియెంతసుందరతమనమలరించు
ఘనసారకదళికాత్మోజముల్ దిలకించు
ఉత్ప— ఏర్పడియెనీతరుల నెంతయునునిగనిగలు
కర్పూరవాసనలు గలిగించుభుగభుగలు
సావి— వింతగతిఁబుష్పములవెలసి కేళాకూళి
చెంతఁదిలకింపఁగడు జెన్నారెఁగంకేళి
ఉత్ప— పాయకున్నతరీతి వనదపఙ్క్తులఁదాఁకు
నీయశోకముమీఱి యిదిచెట్టుకన్నాకు
సావి— లలిఁజూడుమివియెయే లాలతాపుంజములు
ఉత్ప— లలనయియ్యెడఁజూడు లవలీనికుంజములు
సావి— దాడిమీవరభూజ తతులఁగాంచితెబాల
ఉత్ప— యీడులేనివిచాల నీకఁజెప్పఁగానేల
సావి— ఎన్నియనివర్ణింతు నిందున్న తరువులను
గన్నెచెప్పఁదరంబె కనుఁగొన్నహరువులను
ఉత్ప— ఇరవారెఁగడువింత లిందలివిహంగములు
తరుణిపెన్మక్కువలఁదరులతాసంగములు
సావి— కనుసింధువారముల ఘనకాంచనారములఁ
బనసజంబీరములఁ బటునాళికేరముల
రమణిమాలూరముల రమ్యమందారములఁ
దమిగంధసారములఁ దతకోవిదారముల

గురుబీజపూరములఁ గోపులశవీరాపుల
సరళవానీరముల సరసఖర్జూరములఁ
గలితకాసారములఁ ఘనరసాసారములఁ
గలిగినసమీరములఁ గదలునియ్యారములఁ 48

ఉత్ప— గనుఁగొనుముదారములఁ గాంతప్రకారముల
వినుతసహకారముల వెలయుపికవారముల
సలలితాకారముల శారికావారముల
విలసితవిహారముల విశ్రుతచకోరముల 52
జలధరాధారములఁ జాతకకిశోరములఁ
గలితపరివారములఁ గానమయూరముల
ఫలరసాహారముల భవ్యవాక్సారముల
ఫలితశృంగారముల వరరాజకీరముల 56

సావి—ఉత్పలా! మాతలిచంద్రులున్నచోటువదలి కడుదూరము వచ్చితిమి. మాటల సందడింజెట్లుచూచుకొనుచునుద్యానముమానిమహారణ్యముంబ్రవేశించితిమి. సాయం కాలమగుచువచ్చెఁగదా?

ఉత్ప—అయిననేమి యిప్పుడేపోవుదము. ఈ వినోదము లెప్పుడు చూడవలెను?

సావి—ఇంతసేపులేకున్న మాతల్లియేమనును. చెప్పకయేవచ్చితిమి. పోవుదమే ?

ఉత్ప—ఈ పోఁకమ్రాఁకులెట్లున్నవి చూడుము.

సావి—సిమ్రాఁకులుండనిమ్మా. పోదమురమ్మా.

ఉత్ప—అక్కడనెవరే గుజ్జములపై నిద్దురవచ్చుచున్నారు?

సావి—(చూచి) ఎవరే?

ఉత్ప—చెలియా ! వీరు మనపరివారములోనివారని యెంచితిని. కారు. అతఁడెవ్వఁడో రాజకుమారుఁడున్నట్టున్నాఁడు. ఆహా! ఎంతచక్కనివాఁడే!

సావి—ఎవఁడుండునే? ఇంతసుందరుని నెందునుంజూడము.

అనుబంధము 5.

సీ. మెలిదీఁగనుంకించు మొలకలౌ విూసంబు
లిరువదియేఁడులయీడుఁదెలుప
నెలనవ్వుఁలనయంతవిలసిల్లునెమ్మోము
కరుణామహత్త్వంబుసరణిఁదెలుప

భాసురంబగుచేరెడేసికన్నులచంద
ముత్తమజ్ఞానసంపత్తిఁదెలుప
నినతాపమునఁగందుతనుసౌకుమార్యమా
గర్భలక్ష్మీనంతుకళలఁదెలుపఁ

తే. గీ॥ జనువిశాలవక్షంబు నాజానుబాహు
లమలధరణీవరాన్వయక్రమముఁదెలుప
బ్రాహ్మణైక సహాయుఁడై వారువంబు
నెక్కిచనుదెంచు నీఘనుండెవ్వఁడగునొ॥

మ॥ ద్విరదాందోళికలేలరావుసుభటుల్ శ్వేతాతపత్రంబుప
ట్టరదేలాతరుణీమణుల్గొలిచిదండన్లేరుగావాహినుల్
పరివేష్టింపవదేమిధీరవరుఁడెవ్వాఁడౌనొరాసూనుఁడే
వరకార్యంబుఘటింపనిట్టివగఁబోనంజూచెనోయుత్పలా॥

ఉత్ప—సావిత్రీ! మనము కడుదూరమువచ్చియున్నారమింకఁబోవుదము.

సావి—తాళవే పోవుదము త్వరయేమి?

ఉత్ప—ఇంతకుముందు నీవే ననుఁద్వరపెట్టుచుంటివే.

సావి—అప్పుడు సాయంకాలమగుచున్నట్టుతోఁచి యట్లంటిని.

ఉత్ప—అప్పుడు సాయంకాలముగానుండి నీపాలిటికిప్పుడుదయమైనదా?

సావి—లేదు. ఇంకనుబ్రొద్దున్నది. పోవుదమఁట లెమ్ము.

ఉత్ప—సావిత్రీ! పెండ్లిమాటెత్తిన మూలమూలలడాఁగుచుంటివే ఇప్పుడీసుందరుఁ జూచినంతనె—

సావి—ఈహాస్యమెందుకే? ఎదేశమో యెవ్వరో యేదియుం దెలియక భ్రమఁజెందుదునా? పోదముపద. (పోవుచు) ఉత్పలా! నాకేమో యాయాసమగుచున్నది. కొంత తడవు కూరుచుండి పోవుదమా?

ఉత్ప—వారు సమీపమునకేవచ్చిరి. ఇందు మనమిరువురమేయుండుట విహితముకాదు. పోవుదము. (పోవుచు) చెలీ! అట్లేటికి వెనుకఁబడియెదవే! తిరిగిచూచెదవేల? సత్వరముగరమ్ము. అశ్వములు దాఁపునకేవచ్చె. అంతాయాసముగానున్న నందుఁ బోయికూరుచుండుదము. (సావిత్రితో నిష్క్ర—).

[ ప్రవేశము: చిత్రాశ్వుఁడు, సుమాలి (హయారూఢులై). ]

అనుబంధము 6.

చిత్రా—ఉ. చేరఁగరాకయింత వెనుఁజిక్కితి వేటికినింక నెంతయో
దూరము మాపురంబపరతోయధిఁ జేరఁగ నేగె భానుఁడుౕ.
వారువమింత జల్పుసచివా

సుమా— (గుఱ్ఱముడిగి) వినురానిఁక రానురానునే
నారయనింక నొక్కయడుగైనను బెట్టఁగఁజాలఁగంటివే॥.

అ—మ్మా! ఇంకనీసహవాసముచాలును.

చిత్రా—ఇంతతొందరయేల సుమాలీ?

సుమా—ఉదయమునుండి పండ్రెండుయోజనములు వచ్చియున్నామే.

చిత్రా—మనయశ్వములుగదా మమ్ముఁదెచ్చినవి?

సుమా—సత్యవంతా! నేనొక్కటిచెప్పెదను. లోకమున నెన్నిబాధలుగలిగినను ననుభవింపవచ్చుఁగాక యాబాధలనసహచేసి యూఱడింపుమాటలఁ జెప్పువారి సహించుట కష్టము.

చిత్రా—నీవనుమాటయేమి? నాకేమియుఁదెలియదయ్యె.

సుమా—"మనయశ్వములుగదా మమ్ముఁదెచ్చినవి?" యంటివే. మన మెక్కి శ్రమపడకయే మమ్మునూరక పానుపుపైఁ బరుండఁజేసి తెచ్చెనా? మెడగదలనీకుండనొచ్చుచు నడుమసియాడినఁ గళ్ళెక్కుమనుచు, తొడలనున్నసెతురెల్ల నడుగులకుడిగి పచ్చివ్రణములవలెఁ గాన్పించుచు, నింతబాధపడివచ్చినను "అశ్వములు మమ్ముఁదెచ్చె" నంటివిగా?

చిత్రా—సుమాలీ! సమయము వచ్చినప్పుడింత బాధలకుఁ దాళుకొనకున్న నెట్లు?

సుమా—ఇంతప్రాణముఁ బోవఁగొట్టుకొను నంతసమయము నాకేమివచ్చియున్నది?

చిత్రా—పరమమిత్రునిరూపక నీయదికాదా?

తే. గీ॥ అక్కటా వైరిపట్టణమాక్రమించి
యుండ నేమియుఁదోఁపక యుమ్మలించి
నన్ను మాతండ్రిపలవించుచున్నవాఁడు
తడవు సేయఁగమనకెందుధర్మమగునె॥

నీవు చింతింపకుము. ఎంతబాధయయినను నొక్కనాఁడే-ఇంకనుమన సాళ్వపురియిరువదియోజనములున్నది. మనతురంగములు మిక్కిలి సమర్థములు. ఎట్లయినను జేసి రేఁపరుణోదయమగుటకుముందే మనమూరుచేరిన నాయాగమనము నిరీక్షించు తండ్రికి మిక్కిలి సంతోషముగలుగఁగలదు.

సుమా—ఇరువదియోజనము లీరాత్రిలోననా? ఈరాత్రిలోననా? అయ్యో? అయ్యో? మీతండ్రికి సంతోషము గలుగగలదా? ఏలకలుగదు? నాకోడుసనకు త్రేలికి నొంటిదర్భ పవిత్రమునిచ్చుట విచారింపవైతివే?

చిత్రా—మిత్రమా! ఏమైనననుము. ఎట్లయిన నన్ను క్షమించి తురంగమము నదలింపుము.

సుమా—నీవేమైననుము. ఒక్కడుగైన రాజాలను.

చిత్రా—ఇంకను సాయంకాలమయిననుగాలేదే.

సుమా—నా సాయంకాలమయినది.

చిత్రా—అట్లయిన సుమాలీ! నీవు వెనుకనుండివచ్చెదనా?

సుమా—అట్లన్న?

చిత్రా—నేముందుపోయెదను. నీవుసావకాశముగ రమ్మంటిని?

సుమా—ఆహా!

చ॥ జవగతినేడునాళ్ళకలసాళ్వపురంబుననుండిరాత్రియుఁ
బవలునుబాదచారినయిపర్వులువెట్టుచువచ్చినందుకిం
తవలదె సంతసించితిఁగృతజ్ఞతయిట్టిదె

చిత్రా—

కార్యభారముఁ
దవిలివచించితిఁగినుకఁదాల్కానలక్షమింపుమిత్రమా॥

సుమా—చిత్రాశ్వా! ఈగుఱ్ఱములైనను ప్రాణులనుకొంటివా లేక కీలుయంత్రములని యెంచితివా?

చిత్రా—సుమాలీ! నాకార్యవశమున నీయశ్వము శ్రమవిచారింపనైతిని. ఇది మిక్కిలి డస్సియున్నదిగదా? ఏమిచేయవచ్చును?

సుమా—ఏమిచేయవచ్చునా? నిన్నంత దూరమిదిమోసి తెచ్చినందుకు నీవింక దీనిమోసికొని పోవుటయే ప్రత్యుపకారము.

చిత్రా—సుమాలీ! నాయశ్వము క్రిందఁబడునట్లున్నది. (దిగి) నీయశ్వమున కంతాయాసమున్నట్టులేదు.

సుమా—నేనివ్వను?

చిత్రా—ఇచ్చుటకాదు. ఎందైన నిందు జలాశయమున్నఁ బోయి చూచిరమ్ము.

సుమా—(నేలపైఁబండుకొనును).

చిత్రా—ఏమిసుమాలీ! పండుకొంటివి?

సుమా—(సైగలతో దాహమును దౌర్బల్యమును జూపును).

చిత్రా—అయ్యో! ఇట్లేల? నేనైనఁబోయి చూచివచ్చెద.

సుమా—(చిత్రాశ్వుని జేదట్టిపిలిచి కూర్చుండఁజేసి మెల్లఁగలేచి) ఇప్పుడేమనుకొని యేమిసార్థకము? (అనితనయశ్వముంబట్టుకొని) పోయివచ్చెద. నిందేయుండుము. (నిష్క్రమించును).

చిత్రా—అకటా! ఇదివఱకెన్నఁడును నాతల్లిదండ్రుల నెడబాయకున్నవాఁడ నిప్పు డేటికి మణిపురమునకుఁబోయితి. ద్వాదశలక్షసైన్యముతో ఘటకేతుఁడు సాళ్వపురి ముట్టడించియున్నాఁడఁట. మాతండ్రియెంతదుఃఖించుచున్నాఁడో? (జాబుఁదీసి). „ఇట్లించుకైనఁ దారతమ్య మెంచరాని మహాసైన్యముతో ముట్టడించియుండుటకుఁ దోడుగా నీవుదండలేకుండుట యెంతయుఁజింతకు నాస్పదమయ్యె. కాలుసేతు లాడకున్న వి”.

అయ్యో! నేఁడనచెంతనున్న నెంతయో ధైర్యముననుండఁగలనాతండ్రి, ప్రాణములన్నియు నాపైమోపెట్టియున్న మక్కువగల నాతండ్రియొద్దకు వేళకెమగుటకు లేకయున్నదే. నేనేమిచేయుదు? తురంగమా! ఇంతయలసియున్న నీవునన్నికెంట్లు సాళ్వపురిఁ జేర్పఁగలవు?

ఓబలుపలుకుల యలబలములలరఁ గొలకలము చేయువిహంగరాజమా! నీ టెక్కులునాకింత యొసంగవా? అయ్యో! ఎంతశీఘ్రముగ నాజనకునొద్దఁజేర నెంచితినో యంతాలస్య మగుటకుఁ గారణమయ్యె. ఏమిచేయుదు? సుమాలివచ్చువఱకిందే కూరుచుందును గాక. (దిక్కులుచూచి) ఆహా! అచోట నెవ్వరిరువురు స్త్రీలున్నారు? ఈయరణ్యమునఁ బురుషులేలేకుండ నీకాంత లెక్కడనుండివచ్చిరి. ఆయిరువురిలో నా వైపున నున్న సుందరి సాక్షాత్కరించిన వనలక్ష్మివలెనున్నది.

చ॥ సలలితహావిలాసమును జక్కనిసొంపురహించురూపముం
దళతళలాడుకాంతియునుదద్దయునిద్దపుమేలొయారముం
వలపులనించువాఁడి మగవారల మానసము ల్హరింపఁగాఁ
జెలఁగినయీమిటారిమరుచేతికటారిగదాతలంపఁగన్

అనుబంధము 7.

బళిరా! దూరమగుటచే నీయింతిముఖమయినను నాకంత చక్కఁగఁదెలియకున్నది. అయినను దీనిఁజూచినంతనే మదికెంతయో యాహ్లాదముకలుచున్నది. నాచింతలు వంతలంతయు నంతరించి యంతరంగమున కెంతసంతోషము వొడముచున్నది.

సీ. చుట్టుచీఁకటినించిసుమవృష్టిఁగలిగించెఁ
గలికివేనలిఘనాఘనముగాదె
చెన్నారుచిఱునవ్వు వెన్నెలవ్యాలయించెఁ
బడఁతిమోమిందుబింబంబుగాదె

రదనకుందములఁగరకబీజతతిఁ జేసె
శంపాంగి మోవిబల్కెంపుగాదె
ఘనవిలాసాంబుధిమునిఁగి తేలఁగఁజొచ్చె
మెలఁతకన్నుల్గండుమీలుగావె

తే. గీ॥ తళుకుఁగమ్మలఁబ్రతిబింబితములఁజేసె
రమణిచెక్కులు మించుటద్దములుగావె
యౌరలావణ్య, మరకేళ్శృంగార మదిర
హాసు, బళిరేవిలాస, మయారెకాంతి ॥

శా॥ ఈరామామణియీవిలాసవతి యీయిందీవరాలోకతా
నేరాజన్యునికూర్మికూఁతురగునో యేలాసఖింగూడియీ
యారామంబునఁ జేరియున్నయదియో యానందమింపారనా
యూరుం బేరునునేమియోయడుగఁగానుత్సాహముప్పొంగెడున్

(లోపల వ్యాఘ్రధ్వని).

ఆహా! ఏమీయద్భుతారావము! వ్యాఘ్రధ్వానమువలెనున్నది. (దిక్కులుచూచి) ఏమి యులేదే. ఈతరుణులిట్లేటికిఁ బరువులిడుచున్నారు? సింధురములకుఁగలహంస బృందములకు మందయానమునేర్పనియయందిందిరవేణు లెందుకిట్లు భీతిల్లిపరువు లిడుచున్నారు. ఒకతె యీవైపునఁబోయె. ఈజలజాతముఖి యడుగిడఁజాలక జడియయడరఁదొడివడుచున్నది (భయము నభినయించి) ఆహా! ఈభయంకరవ్యాఘ్రమీతరుణీమణిని వెంబడించుచున్నదిగదా! దీననిప్పుడే ఖండించెదను.

(సావిత్రి పరుగెత్తుచుఁ బ్రవేశించును. వెనుక శార్దూలము వచ్చును. చిత్రాశ్వుఁడు వ్యాఘ్రమున కెదురుపోయి యుద్ధమాడిఖండించి యాయాసమున మూర్ఛిల్లును).

సావి—(కొంతనెమ్మదివహించి చిత్రాశ్వునకుగాలి విసరుచు) అకటా! నన్నుగావ వేతెంచి యీమనోహరాకారుఁడు పులింజంపి తామూర్ఛిల్లియున్నాఁడుగదా! అక్కటా! నాప్రాప్తికేమందును?

అనుబంధము 8.

ఈమోహనాంగుని కన్నులపువ్వులఁజూచినపుడే—ఉత్పలా!—చూచినపుడే నాతనువు పులకించి యెంతచూచినను దనివి దీఱకుండుటవలనఁ జూపుపోఁజాలకుంటిని. ఇంత దర్శనమాత్రమునకే నే నోఁచియుంటినో? అయ్యయో! ఇతఁడేరాజకుమారుఁడో.

కం. ధీరాత్మ్మతనార్తావన
పారీణతగహన భైరవవ్యాఘ్రంబుఁ
ఘోరాజిసంహరించిన
యీరాసుతునకు నయారె యీపాటగునే.

దైవమా! నాకొఱ కీసుకుమారున కీగాసిగలుగునే? అయ్యయో! ఇంకెట్లుభరింతును.

సీ. ఈనవమోహనుం డెలమిఁగన్నుల విప్పఁ
గన్నులారఁగఁజూచుకలిమిగలదె
తనభవ్యచరితమీధరణీశుఁడు వచింపఁ
జెవులార వినెడు వైభవముగలదె
యతిథిసత్క్రియ లీధరాధీశసుతునికేఁ
జేతులారనొసంగురీతిగలదె
యీవన్నెకాఁడు నన్నింపుమై మన్నింప
మనసారసుఖియించు మహిమగలదె
తే. గీ. యకటకట చూచుటయుఁజూచినంత మోహ
మెసఁగుటయు నెసఁగినయంత నింతకీడు
మూఁడుటయునిన్నిగతు లొక్కనాఁడెయగునె
దైవమా యిందుకింక నేదారిగలదో.

చిత్రా—(కదలును).

సావి—ఆహా! కదలుచున్నాఁడు. హృదయమా! కొంత నెమ్మదిఁజెందుము.

చిత్రా—(మెల్లనఁ గన్నువిచ్చిలేచి) తరుణీ! నినుఁజూచిన సాక్షాత్కరించిన వనలక్ష్మిఁ జూచిన భంగియయ్యె. నీ వెవరవు? ఇట్లొంటిగా నీవనమునను౦డఁ గారణమేమి? నిన్ను మీఱిపోయిన యాయింకొక్క కొంతయెవరు?

సావి—పురుషపుంగవా! నేనిమద్రరాజగు నశ్వపతిపుత్రిని సావిత్రియను పేరుదానను. అముందుపోయినకొంత నాచెలియగునుత్పల. మాజననీజనకులు సపరివారులై వన విహారము కొఱకిందువచ్చియున్నారు. ఈసాయంసమయమున నీవనమునందలి వినో

నములు చూచు కుతూహలమున నేనును నాచెలియు నిరవువాసి వెడలివచ్చిన మచ్చింతకు ఫలముగా నీభయంకర వ్యాఘ్రము మమ్ముఁ దఱిమివచ్చు ప్రాప్తిఘటించె. అట్టిచో మహానుభావుండవగు నీవు దీనదయాళుండవై పులివాతఁ బడనున్న నన్ను రక్షించి పుణ్యముగట్టికొంటివి.

ఉ. ధీరవిలాసమున్నిరపదేశదయాగుణమున్రహింపదు
ర్వారముగాఁబునర్జననభంగిఘటించితినాకుబెబ్బులిన్
దోరిచినిస్తులోపకృతిదోఁపఁగఁబ్రోచితివెంతచెప్పినన్
నీఋణమేనుదీర్పఁగలనే ధరణీశకుమారపుంగవా.

నాకీనాఁడు ప్రాణదాన మొసంగిన మానవపుంగవుండవైన నీవెవ్వరో యానతిత్తువా?

చిత్రా—కాంతామణీ! నేను సాళ్వరాజగు ద్యుమత్సేనుని పుత్రుఁడను, చిత్రాశ్వుఁ డనియు సత్యవంతుఁడనియు నన్నందురు. అతివా! మాతలిదండ్రులు నినుఁగానని కారణమున భీతిల్లుచుందురు. వేగిరమ పొమ్ము. నేనునుం బోవలయు. (లేచును).

సావి—ధీరపుంగవా! జన్మమున్నంతకాలముం దలఁచుకొనునట్లు ప్రాణరక్షణ ఘనకార్యముఁ గావించితివి. వ్యాఘ్రముతోఁ బోరాడి మూర్ఛితుఁడవై డస్సియున్నావు. నిమిషమాత్రమాయాసముదీర్చికొని పోవరాదా ?

చిత్రా—తరుణీ! నాకేమియు నాయాసము లేదు.

మ. ధరణీశాన్వయుఁ డుగ్రకాననమృగధ్వంసంబుగావించుచె
క్కరణిన్ద్విజునిధర్మమందబలయాకంజాక్షిపైఁబెల్లుగా
నరుదెంచెంగదయద్దియొక్కపులియేయంతేమినేఁజేసితిన్
దరుణీనన్గొనియాడనేలయిదియున్ దాదృజ్మహాకార్యమే.

సావి—ధరణీశకుమారా! నీమహోదారగుణము గొనియాడఁదగినది. తామొనర్చిన యెట్టి ఘనకార్యమునైననుఁ గొంచెపుఁబనిగా భావించుట ధీరులకు నైజగుణము. ఆర్తావనము ధర్మమనుటయు ధర్మము. అయినను నీవుడస్సియుండుట నీవెంత దాఁచినను గుఱుతింపనేరనా? ఇంత త్వరయేల? పోవుదువఁట లెమ్ము. కూరుచుండుము.

చిత్రా—రమణీ! నాకావంతయు డప్పిగలుగదు. నీయుపచార వాక్యములకు సంతసించితి. మీవారించలఁచుకొన్న నీవిందుండుట చెల్లదు. నీచెలి యింతకుమున్నే పోయి వారితో నీవు పులినోటఁబడితివని చెప్పియుండునోపు. పోయి వారిభయము మానుపుము. (పోవఁబోవ).

సావి.— ఆ. వె. ఉర్వినీఁడులేనియుపకారభరమునఁ
గృతమెఱింగి వేఁడుకీరవాణి
నిలిచియొక్కమాట పలుకరింపక నిరా
దరతఁబోవుటెందుధర్మమగునె.

చిత్రా.— తే. గీ. తరుణినీతలిదండ్రులు దలఁకుచుండ
రంచునిన్నఁబంపనెంచితినంతెకాని
కలదె నాకు నుపేక్షయీకరణినన్ను
గడఁగికొనియాడవలదుపకారమనుచు.

(మఱియుంబోవఁబోవు).

సావి.— ఆ. వె. ఇట్టిధీరవరునకిట్టిదయాళున
కింతకరుణలేమి యెట్లుకలిగె
నట్టులైనఁబులికినడ్డురావలదంచు
నిన్ను వేఁడియుందునే మహాత్మ.

చిత్రా.— తే. గీ. కార్యభరమునఁబోవంగఁగడఁగియున్నఁ
గరుణలేదంచుఁగడుననాదరమటంచు
నింతవిసుగునమాటాడనేలరమణి
యిందెనీముద్దుపలుకులవిందుఁగాక.

(కూరుచుండును).

సావి.—రాజనందనా! నీవెక్కడికిఁబోవుచు నిక్కడికివచ్చియున్నావు?

చిత్రా.—కామినీ! ఆచరిత్రము నన్నడుగకుము. రమణీయములగు నీమధుర భాషణములవలన నాకున్నచింత యింతశాంతమగుచుండ నా చరిత్రమునడిగి దుఃఖము నేటికిఁ దెచ్చెదవు?

సావి.—అట్లయిననడుగను. ఇందేసమీపమునమావారున్నారు. అచ్చటికివిచ్చేసి యింతాతిథ్యము స్వీకరింపుము రమ్ము.

చిత్రా.—రమణీ! నీవిచ్చు నాతిథ్యములన్నియు నాకుముట్టెను. కార్యపరవశత్వమున నాకేమియునాయాసమనిపించదు. నామిత్రుఁడు సుమాలి నీరుదెచ్చుటకటుఁబోయి యున్నాఁడు. అతఁడు వచ్చువఱకు నిందేయుండవలయు.

సావి.—అతఁడు వచ్చినపిదప మీరిద్దరు విచ్చేయ వచ్చుఁగదా?

చిత్రా—అబలా! నాకున్న కార్యమున నన్ను మనియు నిద్రయనియు నపేక్షింపరాకున్నది. అతఁడు వచ్చినవెంటనే యిచ్చోటు వెడలిపోవలయు. మన్నింపుము.

సావి—(యోచించి) ధరావరనందనా! నిన్నొకటియడుగవచ్చునా?

చిత్రా—అదియేమి?

సావి—ఎంతధీర యీతరుణియని యెంచకుము. దాఁపఁజాలని మోహాతిశయము నన్నడుగఁ జేయుచున్నది. అశ్వారూఢుఁడవై నీవువచ్చునప్పుడు దవ్వుదవ్వుల నినుఁ గన్నప్పటినుండి యదేమి దైవాయత్తమో నామది నీపైఁజిక్కి పాయఁజాలకున్నది. నీవవివేకమని యెంచినను అచాతుర్యమని తలంచినను సాహసమని తలపోసినను కాదనను. దైవప్రేరణచే మొదటనే మోహాంకురము కలిగియున్న నాకుఁ బ్రాణదానమొసంగి రక్షించితివి. కావున నడిగెదను. నీకుఁబరిణయమై యున్నదా?

చిత్రా—మానినీమణీ! మరందధారలై చెఱకుపాల వెల్లువలై కండచక్కెర పలుకులై నీపలుకులు నాయాయాసమునంతయు నడఁగించెను. నే వివాహితుఁడఁగాను. కాని నీయపేక్షమానుము.

సావి—రాజకుమారా,

మ. మనుజాధీశకుమారుల బటములన్ మాతండ్రి వ్రాయించి నా
కనయంబుందిలకింపనిచ్చెఁగద దైవాయత్తమే మందునా
మనసందొక్కరినైనఁగోరదిటు ప్రేమంబారసీయందెనేఁ
డెనసెన్ బాయకయిట్టులయ్యెనిఁక నింతేభాగ్యమో భూవరా.

(కన్నీరునించును.)

చిత్రా—కాంతామణీ! ఈకన్నీ రేల? నాకు భరియింప వెగ్గలమగు నూఱడిల్లుము. నేను దాఁపఁజాల. నినుజూచినప్పటినుండి నామనంబును నన్యాయత్తమైయున్నది. ఐనను క్షమింపుము. విధిలేకున్నది.

అనుబంధము 9.

సీ. తనయింటికెలమిమైఁదనయంతఁజనుదెంచు
సిరికిమోకాలొడ్డుచెనఁటిగలఁడె
నలినాక్షినీదునిశ్చలభావమునుగాని
యాడిమెచ్చనిదుండగీఁడుగలఁడె
నినుఁబోలురమణికోరినమోదమునఁబెండ్లి
యాడనొల్లనిమొక్కలీఁడుగలఁడె
తనభాగ్యలక్ష్మినాఁదగుసతీమణికంటి
తుదకునీరొదవించుతులువగలఁడె

తే. గీ. యయినఁగాలంబుఁగార్యంబుననుసరించి
యిపుడువలదంచువిన్నపంబింతచేయు
తెలుఁగుపరికింప నకటనీకొఱకుఁగాని
నాకొఱకుఁగాదు వికచనాళీకవదన.

సావి— తే. గీ. నాయెడనుపేక్షలేని చందంబుఁదెలుప
నలరునీమాట నాచెవికమృతమయ్యెఁ
దలఁపులీడేఱ వేయేలధన్యనైతిఁ
బ్రాణవల్లభ నేనసమాననైతి.

మనోరమణా! నాకొఱకు నన్నిప్పుడు వరింపనంటివి. నాపైఁబ్రేమగలదంటివి. ఇది గూఢాశయముగానున్నది. నినుఁదొలుతనే మోహించితినంటిఁగదా? నామోహమెప్పుడు సుస్థిరమైనదో యప్పుడే నీదాననైతి. నీకుఁగల దుఃఖము నాదుఃఖమేయగు. ఇంకనైన నీచరిత్రమానతిమ్ము.

చిత్రా—మానవతీమణీ! నేనిప్పుడొక కార్యమునకై పోవుచున్నాఁడను. నాకుఁ బరాజయముగలిగి రాజ్యచ్యుతియైన నెట్లు?

సావి—ఎట్లయినను నీతోడిదేలోకముతప్ప నాకు వేఱుకలదా? నిన్నా నీరాజ్యము నా నేఁగామించినది?

చిత్రా—అలివేణీ! నేనుపోవుకార్యమున నాకుమృతిగలిగినను గలుగవచ్చుసుమా.

కం. ఎడరైనవేఱెయొక్కని
వడికానివరించి చెట్టఁబట్టినవేళన్
బడఁతీయీచిత్రాశ్వుని
యెడఁగలదనుమోహ మప్పుడేమాఁ జెపుమా.

సావి—కటకటా! నీవు నామనసరయ నేరవేయని దుఃఖించుచున్నాను. „చూచిన మాత్రముననే యీకాంత తనకింత మోహమున్నట్లువచించెఁగదా? ఇది క్షణికముగానుండు" ననియెంచెదవు కాఁబోలు. తప్పఁదలచితివి. నాకుఁగల మోహము వజ్రయోగమువంటిది. క్షణమున నుద్భవించినను ఫలమున నదీసముద్రములనించునది. దైవము నన్నరగంటఁజూచి నీకేమైన నాపదఁగలిగించెనా?

కం. ఆమరణమునేఁగన్యక
నైమనియెదఁగాక వృత్తమాఱఁగ నితరున్
గామింతునె యోవల్లభ
నామానస మరయలేనె నాకున్ వగపా

చిత్రా—రమణీమణీ ? మోహావశమునఁ దెలియక మాటలాడవచ్చుఁగాక యాడినంత యుఁ జేయుట—

## అనుబంధము 10.

సావి—ప్రాణవల్లభా! మనసెఱుఁగని కల్లయు నోడలెఱుఁగనివిషమునుండు నే. నీవేబాస చేయుమన్నను జేయుదు. ఇదిగో పచ్చని యీచెట్టునీడనున్న శైవచించెద.

### ద్రుతవిలంబితము.

చిత్రా—వలదు వేఁడెద బాసలు గీసలుఁ
నెలఁత నీదగు నిశ్చయబుద్ధికిన్
గలిగె మోదము కానక పల్కితిన్
నలినలోచన నన్ను క్షమింపవే ॥

తరుణీ! యిప్పటి నాయానందమింతయని చెప్పఁజాల. నిను నోనాడినందుకు మన్నిం పుము. మావిరోధియగు ఘటకేతుఁడు మహాసైన్యోపేతుఁడై సాళ్వపురము ముట్ట డించియుండె మాతులగృహమున మణిపురముననున్న నాతండ్రి యీజాబు వ్రాసియున్నాఁడు. దీనింగాంచిన నాచరిత్రమంతయు విశదమగు. (ఇచ్చును).

సావి—(జాబుఁ జదువుకొనుచుండ).

చిత్రా—ఇప్పుడక్కడికిఁ బోవుచున్నాను. నాకు ఘోరయుద్ధము లభింపఁగలదు. యుద్ధజయము దైవాధీనమగుటచే నిట్లుమాటలాడితి.

సావి—(జాబు వెనుకకిచ్చి) ఐన నాప్రార్థనమింత యాదరింతువా!

చిత్రా—అదియేమి?

సావి—మాతలిదండ్రు లిందేయున్నారు. వారియనుమతిపడసి నిన్నిప్పుడే వివాహమాడి నీవెంటవచ్చెద ననుగ్రహింపుము. మాతండ్రి సైన్యముతోడ నీవెంటవచ్చెద.

చిత్రా—ప్రియా ! కలదా యిట్టిమాట ?

చ॥ కదనమొనర్పఁబోదు నటకాదనకిట్టివివాహమెట్టులా
బ్రదుకునుజావునున్న డువరానితఱిన్ వరియింతునన్న నీ
హృదయమునిశ్చలత్వమరరేకొనియాడఁదరంబె యైననో
మదవతిసమ్మతింపఁదరమాదరమారఁగనాకునియ్యెడన్

నీకింతటి దృఢమానసము? శత్రువుచే ముట్టడింపఁబడియున్న పురము నీతో నెట్లు ప్రవేశింతును. చింతా సముద్రమున మునిఁగి నన్నే కలువరించుచున్న నాతండ్రి చింత

మాని యేమిసంతోషమున నిన్నిప్పుడు పరిణయమాడఁగలను? మీతండ్రి సేనకూర్చుట లోనగు కాలమున నక్కడ నేమగునో. యుద్ధజయముపొంది శీఘ్రకాలమునవచ్చి నీయభీష్టము నెఱవేర్పఁగలను. నాకింక సెలవిమ్మి. (కౌఁగిలించును).

సావి—నాథా! నిన్నుఁబాసి నేనిందుండఁజాల.

## అనుబంధము 11.

[ ప్రవేశము: సుమాలి (ప్రక్కన). ]

సుమా—(చూచి నోరుమూసికొని యాశ్చర్యము నభినయించి) ఈయడవిలో లేవఁజాలకున్న వానికిది యెక్కడఁగలిగె? వీనితండ్రితో నేనన్నమాటల నొక్కటియు నబద్ధముకాదు. ఏమివేడుక జరుగఁగలదో చూచెద. (ప్రక్కకునిల్చును).

చిత్రా—సావిత్రీ! నిన్నుబాసి యవలఁజన నాకునుగాళ్ళాడవు. అయినఁగార్యభారము మిక్కిలిగానున్నది. విధిలేకున్నది. సెలవొసంగుము.

సావి—నాథా! ఒక్కయబలను దోడ్కొనిపోవ నీకింతభారమా?

మత్తకోకిల. ప్రాణవల్లభనన్ను నీవిటుబాసిపోవఁగవంతచే
నూనభంగినిలోనఁబ్రాణములూనియుండెడుదాననే.

చిత్రా—మానినీమణిపూననేటికిమానుమా ర్తవిధానముల్
ఆనతీఁగదెకానవేకరియానసేనిదెవచ్చెదన్.

సావి— మారసుందరధారుణీశకుమారమారునిబారికిన్
దేరకంతముఁజేరకుండఁగధీరయంతటిధీరనే.

(కన్నీరునించును).

చిత్రా—కోరియూఱడుభూరిశోకముగూరనేలయవారిగా
నీరజాననసారెఁగన్నులనీరునింపకు మూరకే॥

సావి—అయిన నాకేమానతిచ్చెదవు?

చిత్రా—ప్రాణసతీ! నేనింకేమిచెప్పఁగలను? నీయట్టిసతీమణి నాకులభింపనుండఁ బరమోత్సాహమున నే నిదే యనికిఁబోయెదను. శుభముగ ననుఁబంపుము. దైవము నాకు జయమొసంగెనా యచిరకాలమున నే వచ్చి నీయాశ్లేష సౌఖ్యమనుభవించెద. వేఱొకవిధమాయెనా—మానినీ—(కన్నీరునించి) ఈమొదటిముద్దేకడముద్దుగాభావించి

(ముద్దిడు).

సుమా—(దగ్గును).

చిత్రా—ప్రాణేశ్వరీ ! నామిత్రుఁడు వచ్చినట్లున్నది.

అనుబంధము 12.

నాకొనతిమ్మా. ఆవెయంటు దూరమున మీయుత్పలయే కొంబోలు నిన్ను వెదకు చున్న చందమునఁ బోవుచున్నది. పొమ్మా. ననుమఱవకుము. (ముందతికివచ్చును.)

సావి—(కన్నీరునించుచుఁ దిరిగిచూచుకొనుచు నిష్క్రమించును)

సుమా—(ముందతికివచ్చి) ఓచిత్రాశ్వా! ఓసత్యవంతా! ఓమీతండ్రికొడుకా! ఎక్కడనున్నావు ?

చిత్రా—(సుమాలియొద్దకువచ్చి) సుమాలీ ! ఎంతసేపుపోయితివి !

సుమా—ఆ-హాఁ-ఎంతసేపుపోయితినా? నీ వెక్కడనుంటివి ?

చిత్రా—అందొక శార్దూలము వచ్చియున్నఁబోయియుంటిని.

సుమా—అదేమి మగపులియా? ఆఁడుపులియా!

చిత్రా—ఏపులియయిననేమి?

సుమా—అది నీవేఁటకుఁజిక్కెనా? నీవలలోఁబడెనా ?

చిత్రా—ఏమిట్లడిగెదవు ?

సుమా—పోని! పోయి యేమిచేసితివి ?

చిత్రా—దానింజయించిని.

సుమా—ఎట్లుజయించితివి ?

చిత్రా—యుద్ధమాడి.

సుమా—ఏయుద్ధము ?

చిత్రా—"ఏయుద్ధము?" ఏమిట్లుసంశయించిన మాటలాడెదవు !

సుమా—నీవు సత్యవంతుఁడవుగదా ?

చిత్రా—అయిన ?

సుమా—సంశయమేలకలుగు? ఇఁకమనమూరికిఁ బోవఁబనిలేదుగదా?

చిత్రా—ఎందుకు ?

సుమా—పెద్దపులివిడుచునా ?

చిత్రా—నీమాటలు నాకుఁదెలియవు

సుమా—ఆ. వె॥ ఎంతవారినైన వింతమైనిర్జించుఁ
గాంచఁగాంచమించుమించుపగిది
భ్రాంతి నేమరంగఁ బైఁ బడిలోఁగొనుఁ
గలికివగలఁ బెద్దపులియారె ॥

ఇట్టిపెద్దపులి నినుఁబోవనిచ్చునా ! ఉండనిమ్మా. నావృత్తాంతము వినలేదే!

చిత్రా—నీవృత్తాంతమేమి?

సుమా—నిను వెదకికొనివచ్చు మార్గమున రెండు వింతమృగములఁ గంటిని.

చిత్రా—ఏమిమృగములు?

సుమా—విచిత్రములగు నల్లతలలుగల రెండుపులులు. ఒకటి పెంటి. ఒంటి పోతు. మానవభాషతో మాటలాడుచుండెను.

చిత్రా—నీమాటలింకఁజాలును.

సుమా—అబద్ధమా?

చిత్రా—ఎక్కడఁజూచితివి?

సుమా—ఇక్కడనే దాఁపుననే.

చిత్రా—అవియేమాయెను?

సుమా—ఒకటితోనొకటి సరసమాడుచుండి నాధ్వని విన్న వెంటనే యొకటి పరువెత్తి నాయొద్దకువచ్చెను.

చిత్రా—వచ్చి?

సుమా—అట్లనే నిలిచెను.

చిత్రా—నిలిచి?

సుమా—అట్లనే నిలిచెను.

చిత్రా—కడకేమి చేసెను.

సుమా—పెద్దపులినిఁజంపినట్లు చెప్పెను.

చిత్రా—ఎవరు?

సుమా—నీవు.

అనుబంధము 13.

చిత్రా—విదూషకా! హాస్యమేల చేసెదవు? నీతో నావృత్తాంతము చెప్పవలయు ననియే యెన్నియుంటి. నీవచూచితివి కాఁబోలు. అయినను సవిస్తరముగాఁ జెప్పెదఁ గాని పోదమురమ్ము. ఇపుడు గుఱ్ఱములలసియున్నవి. నీవుచిక్కినా?

సుమా—గుఱ్ఱములకంటె నీవెయెక్కువగా నలసియున్నట్టుతోఁచె. నాకేమో యూరికిఁ బోవఁ బనిలేదని తోఁచుచున్నది. ఇంకగుఱ్ఱములపై నేమిచింత?

చిత్రా—ఇటురమ్ము. వృత్తాంతమంతయుఁ జెప్పెద. (సుమాలితో నిష్క్రాన్త).

[పునః ప్రవేశము-ఉత్పల].

ఉత్ప—అయ్యో! సావిత్రీ! ఎంతెంత వెదకినను జిక్కకున్నావు గదా? అయ్యో! పులి నినుఁజంపెనని నీజననీజనకుల కెట్లువార్త యొఱఁగింతు. చీఁకటి పడును వచ్చెఁగదా? ఇంక నిన్నెంత వెదకింపనగు.

## అనుబంధము 14.

(చచ్చియున్న పులింజూచి).

ఆహా! ఏమియాశ్చర్యము! ఈపులియిటుచచ్చిపడియున్నది. ఆహా! ఇట్లుండునా? సావిత్రి మోహదృష్టులఁజూచియున్న యామనోహరాకారుఁడీపులిని సంహరించి సావిత్రినట్లే కొనిపోయియుండునా? ఎట్లయిన నాతరుణి పితరులతో వృత్తాంత మెఱిఁగింపవలయు-(పోవుచుండ)

[పునః ప్రవేశము సావిత్రి]

సావిత్రి—ఉత్పలా!

ఉత్పల—మాయమ్మ! ఉన్నావా? అమ్మరో! నీవు పులినోటఁబడితివని భీతిల్లితి.

సావిత్రి—పులినోటఁబడనుండి తప్పించుకొంటిఁగాని-చెలియా! ఏమనివచింతును.

ఉత్పల—తరుణీ! ఏలయింకనునీకు భీతియుఁజింతయునున్నట్లు సూచింపుచున్నావు. ఆపులి తరిమికొనివచ్చిన భయమింకనువదలలేదా?

సావిత్రి—ఆపులిభయమేమియులేదు-ఆయాలోచనయులేదు.

ఉత్పల—అట్లయిన నీచింతయయిననేమి?

సావిత్రి—ఆపులినను్రమింగియుండిన నొకనిమిషమున నాయాసమునకుఁగడయగుచుండె. ఇప్పుడు నాకున్న దుఃఖమింతయనిచెప్పఁజాలము. హా! దైవమా (అనికన్నీరునించును.)

ఉత్పల—చెలియా! ఏటికిఁగన్నీరునించెదవు? (స్వ) ఆహా! తెలిసెను. ఈచెలికి మన్మథావసజనించియున్నది. అయ్యో! మూర్ఛిల్లునట్లున్నదిగదా, శీఘ్రగతిఁబిలిచి కొనిపోవలయు.

(నిష్క్రమింతురు).

---

## తురీయరంగము-అడవి.

[ద్యుమత్సేనుఁడు (అంధుఁడై) సానంద (కన్నులకుఁ బటము గట్టుకొని) కూరుచుండి యుందురు].

### అనుబంధము 15.

ద్యుమ—తరుణీ! సానందా! నీవు నావలె నంధత్వముఁగలిగించుకొన్న మనకెవ్వరుదిక్కు కాఁగలరు? నిన్నటినుండి యింపుపడియున్నారమే. ముందేమిగతి? వలదు. పట కొండము నిప్పుము.

సానం—నాథా! ఇదియేటిమాట? నీవుచూడలేని నాకన్నుల నేనొక్కపదార్థమునైనఁ జూడనిచ్ఛయింతునా? ఇట్లేయుండనిమ్ము. క్షమింపుము. మనకెవ్వరును దిక్కు కాకున్న నిట్లేప్రాయోపవేశమునఁ బ్రాణములు వాయుదముకాక.

ద్యుమ—తరుణీ! ఇంతపట్టేలని మనపుత్రునుదంతము తెలియువఱకైనఁ బ్రాణములభరించి యుందము. వలదుడుగుమా.

సానం—ప్రాణేశా! ఎన్నియో సంకటము లనుభవింపనుండ మనకేటికిఁ జావుగలుగు? నీవు భ్రాంతివహింపకుము. మనకేమియు భయములేదు. దిక్కులేనియనదల రక్షించు దైవము మాపాలఁగలుగకుండఁడు. నాప్రతిన నెఱవేర్పనిమ్ము.

ద్యుమ—హా! దైవమా! కుమరా! సత్యవంతా! నెలదినములనాఁడు నిన్నుఁగన్నులారఁ జూచుటయే మాకుఁగడచూపయ్యెనే. ఈ ఘోరాత్ములు ఘటకేతుని యాజ్ఞ తెఱంగున నాకంఠము ఛేదించిపోవరైరే.

ఉ. దారుణరాజ్యవిచ్యుతిపదంపడి యంధతమీఱఁ బ్రాణము
ల్చేరికఁబాయవేలయిటుచేయుదురే ఘటకేతుఁడంపునా
క్రూరభటుల్గడంగితలఁగోయక చెప్పినయాజ్ఞమీఱిని
ష్కారణవైరమూనియుపకారముచేర మహావిరోధముల్

సానం—నాథా! మనకిట్టిపాటు రావచ్చునా!

### అనుబంధము 16.

ఉ. యోగ్యపదంబువోయె నయయోయటవీస్థలిదిక్కులేని వై
రాగ్యముఁబూనుటాయెఁ బ్రఖరంబగునంధతయుట్టిపాటునల్
భోగ్యముగాఁగ జేరెఁ బ్రియపుత్త్రునిఁజూచుటతీఱెనిట్టిదా
ర్భాగ్యముగల్గనేర్చు నెధరాస్థలినెవ్వరికైనవల్లభా.

ప్ర॥ సుమాలి. చిత్రాశ్వుఁడు (దూరమున).

చిత్రా—సుమాలీ! ఈదుశ్శకునములఁ గంటివే. దారినంతయు నిట్లేయగునే.

సీ॥ ఎడమ దిక్కుననుండి కుడికి నేతెంచెనీ
గరుడిచుఁ బాలయు నరుదు గాఁగఁ
గర్ణ కఠోరంబు గాఁగూసె పగలెఘూ
కానీక మధిక భయంకరముగ
నూరకూరక మనయుత్తమాశ్వములకుఁ
గన్నీరు పెల్లుగాఁ గాఱఁదొడఁగె
నిలువక నావామనేత్రంబు భుజమునా
కంపించె భీతి యగ్గలముగాఁగ
తే॥గీ॥ నిట్టిదని చెప్పఁగారాని పట్టరాని
తాపమున మానసం బెల్లఁ దల్లడిల్లె
నాకసము ద్రుంగి పైఁబడి నట్టులయ్యె
లోకమంతయు మునిఁగిన జోకఁదోఁచె.

ఇంకను సాళ్వపురి నాలుగుయోజనములున్నది. మాతండ్రి కేపాటుకలిగెనో చిత్తమంతయుఁ గళవళమంది కడుపునఁ జేయివెట్టి కలచినట్లున్నది. ఏమియుఁ దోఁపకున్నది.

## అనుబంధము 17.

సుమా—చిత్రాశ్వా! ఇట్లు యోచనఁ జెందిన నెట్లు. అవశకునములేమో యవుచున్నవి ఆపెద్దపులికన్నె నిన్ను భుజించి పొమ్మనెనంటివి. భుజింపకపోయితివి. నాకును మృష్టాన్న భోజనముఁ దప్పించితివి. ఇంతకంటె నవశకున మెట్లు? ఆకన్నెయందుకు వన్నె పెట్టినట్లు నీ వెంటవచ్చెదనని చెప్పెనంటివి. ఇది రెండవ యవశకునము. నీవా చరిత్ర చెప్పినప్పుడే నాకును మనసున శంకగలిగె. అయిన నేమాయె. నీవంతేమియు భయపడవలదు. పరువుదూరము పోయితిమేని మనరాజ్యమువచ్చును. ఎవ్వరినైన విచారింపవచ్చును. పోదమురమ్ము.

చిత్రా—సుమాలీ! నాకొళ్ళుకుప్పవడుచున్నవి. ఏటికో మనసునఁ జెప్పరానియారాటము గలుగుచున్నది. కొంచెము విశ్రమించుకొని పోవుదము.

సుమా—నిన్నంతయు నీవునన్నుఁ దీవరించుచుంటివి. నేఁడు నేనే నినుఁ దీవరించు విధానముగలిగె. కారణమిప్పుడు తెలిసె.

చిత్రా—ఏమి ?

సుమా—నీకూరకిఁబోవ మనసు లేదు. మరల నిన్నా పెద్దపులి వెనుక కీడ్చుచున్నది.

చిత్రా—సుమాలీ ! నను హాస్యమాడుటకిదియా సమయము ?

సుమా—హాస్యమునకు సమయము గలుగవలెనా ? క్రొత్తఫక్కి దెచ్చితివి.

చిత్రా—నాకట్టి భ్రాంతియున్న నప్పుడే యచ్చోట నిలువక పోయితినా !

సుమా—కొన్ని పదార్థముల కాకర్షణశక్తి సమీపమున నున్నప్పుడు కలుగు. మఱి కొన్నిటికి విడిచి దూరము చనుకొలఁది నాకర్షణశక్తి యెక్కువగు. ఇదేమాశ్చర్యము?

ద్యుమ / సానంద—హా! దైవమా, హా! శ్రీహరీ! మాకెట్టి పాటుఁ దెచ్చితివి.

చిత్రా—(ఆలకించి) తాళుము. సుమాలీ ! ఏదో దూరమున నార్తారావము విననయ్యె.

సుమా—(ఆలకించి) చిత్రాశ్వా ! ఇది నిక్కముగా భీతికము. నిను హాస్యమాడినందుకు మన్నింపుము. నా చెవుల నే నమ్మవచ్చు నేని యిది మీ జనకుని ధ్వని గాఁదోఁచె. పోవమురమ్ము. (చిత్రాశ్వునితో సమీపించును).

ద్యుమ—హా ! శ్రీహరీ !

ఉ. నెవ్వగనివ్వటిల్లజననిందితకృత్యముగాదెచూడఁగా
నివ్వసుధాతలంబున నరేంద్రులులేరొకడంగివైరిపైఁ
జివ్వకురారొధీరగతిఁజేకొనరోజయలక్ష్మినాజిలో
నెవ్వరుగానిక్రూరమతినీగతిఁగన్నులఁబోవఁగొట్టిరే.

చిత్రా—హా! దైవమా ! (అని మూర్ఛిల్లును).

ద్యుమ—ఎవరక్కడ ? ఎవరక్కడ ?

సుమా—రాజేంద్రా ! మీదుఃఖముఁ జూడవచ్చిన పాపులము.

ద్యుమ—సుమాలీ ! ఎప్పుడువచ్చితివి ? మాకుమారుఁడెందున్నాఁడు ?

చిత్రా—నన్ననవరతము సముచిత ప్రేమఁబోషించుచుఁబాయకుండినతలిదండ్రులారా! నేనేమని వచియించువాఁడను.

శా. జోదుల్సంగరమాడుచుందురనుచున్ శోకంబునన్దూలుని
న్నోదార్పంగలనంచుఁగల్గెనదిరాయుద్ధంబటంచుఞ్జయా
మోదంబైననువీరనాకమయినంబొల్పారునంచెంచితిన్
ఈదౌర్భాగ్యముగల్గునంచు జనకాయేనెంచనస్వప్నంబునన్.

పితరులారా! మీమోములఁజూచి నేనెట్లుభరింతును. ఈయరణ్యమున నిట్టిపాటు మీకెట్లుగలిగె.

ద్యుమ—తనయా! నాజాబువలన నాచరిత్ర యింత యెఱుఁగనయ్యెఁగదా? ఆజాబు సుమాలినిబంపిననాఁడే—ఏమనిచెప్పుదు?

సీ. వరసాల మగలించి పురదాహ మొనరించి
ఘటకేతుఁ డాహవకర్తనుఁడగుచు
బలుసైన్యమురుదేఱ బవరంబొనర్చినా
చిన్నిసేన జయించి నన్నుఁబట్టి
నీచంవ మెఱిఁగింప నిక్కచ్చియొనరించి
జక్కియంగ నసుఁజెఱసాలనునిచె
బాధించెఁ గొన్నాళ్ళు పరమ పాపుండౌచుఁ
గన్నులుగట్టిగాఁ గట్టఁజేసె
తే. గీ. భటులఁ బంపించి తలఁగోయఁ బనిచెమున్న
వారు రాజ్యంబు వెడలంగఁ బాపిచనిరి
భీమమౌనేత్ర బంధంబు విప్పినంతఁ
గటకటా నిన్నఁగన్నులు గానవయ్యె.

చిత్రా—అయ్యయ్యో! (అనిదుఃఖించును)

సావం—సీ. సీతంద్రి చరితంబు నెగులు వింటివెపుత్రి
యింక నాచరిత మదేమిచెప్పఁ
బ్రాణేశుఁడరిచేతఁ బడెనంచువినినంత
ఘటకేతుఁ డధిక దుష్కర్ముఁడగుట
నవరోధ మెడఁబాసి యగ్రజాతుని యింటఁ
దెలియ కుండగఁగొన్ని దినములుంటి
వీటనన్నెమకించు వృత్తంబు వినిభ్రాంత
రీతినిక్కానఁ జేరితినిమున్న
తే. గీ. నిన్న నీవిభు చరితంబు విన్న యంతఁ
బెల్లుపొగిలితి యింతటి భీమభంగి
చనునె కనుకట్టు విప్పుట సాధ్యమయ్యె
నట్టివిప్పితి దృష్టిలేదయ్యెఁదండ్రి.

చిత్రా—హా! దైవమా!

ద్యుమ—శా. ఇన్ని చక్రియ యెన్న నేల యటు లెంతే గ్రుడ్డి నే యుండఁగా
నన్ను న్గాంచినయంత నెంతవలదన్న న్మానకిచ్చాన తాఁ
గన్నుల్గట్టుకొనెన్నటాంచలమునన్ గన్నా వెయిన్నాళ్ళకో
యన్నా చీకులమైతిమేలయిఁకఁ గట్టా మేము జీవింపఁగన్

చిత్రా—తండ్రీ! రాజ్యముపోయినందుకు దుఃఖింపను. అరణ్యావాసము గలిగినందుకు దుఃఖింపను. పడరానిపాట్లకన్నిటికి నోర్చుకొనుచుంటిని. మీముఖములఁ జూచిన మాత్రముననే తరంగములభంగి నుబికివచ్చు దుఃఖపరంపర కట్లోరుచు. ఇంతటియాసుర కృత్యమెందైన వింటిమే హా! అశక్యమశక్యము. (దుఃఖించును).

సానం—కుమారా! నిన్నైనె నీవువచ్చియున్నఁ గన్నులారఁ గడసారిసీమూ ర్తిఁజూచుచుంటిఁగదా?

ద్యుమ—తండ్రీ! ఇఁకమూఁడుమాసములకు నీకు యౌవరాజ్యాభిషేకము చేయ నెంచియుంటినే. అక్కటా! ఇట్లగునే.

శా. నాకాధీశుని వై భవంబలర రాజ్యం బెల్లనీ వేలన
స్తోకానందముఁ జెందలేమికిని నేశోకింపనింతేనియున్
రాకేందుప్రతిమానమైనగవుతో రాజిల్లునీయాస్యనా
ళీకంబున్దిలకించు భాగ్యమయినన్ లేకున్నదే పుత్రకా.

చిత్రా—(లేచి) సుమాలీ! నేనీదుఃఖము భరియింపఁజాలను. మాతల్లిదండ్రుల నిందే నామాఱు కొన్నిదినములు చూచుకొనుచుండుము. నేనిప్పుడపోయెదను.

ద్యుమ } సానం } అయ్యో! అయ్యో! కుమారా! ఎక్కడికిఁబోయెదవు.

చిత్రా—సీ. కడుక్రూర కర్ముని ఘటకేతు మెడనెత్తు
రీధరాస్థలిఁ బ్రవహించువఱకుఁ
గాదేని నాయంబకము వాని యెదగాఁడి
పొదలి వీఁపునదుస్సి పోవువఱకు
నొండేని మోకాలు గుండియ నిడివానిఁ
జదిపికుత్తుకనల్చి చంపువఱకు
లేదేని మీకైన లీలబాఁకునఁ గ్రుమ్మి
వాని కన్నులఁ దీసి వైచువఱకుఁ

తే. గీ. గలుగ నేర్చునె యీయట క్షత్రజన్మ
మగునె సఫలంబు, ధనువును నసియుఁ గేలఁ
బట్టుటేటికి, నామాటఁ బాటిచేసి
వెడలి పోవంగ సెలవిండు పితరులార.

ద్యుమ—తనయా! కన్నులులేని మేము నీవుండఁగదా యింకను బ్రాణముల ధరించి యుండఁగోరుట? నీవెంతధీరుఁడ వైనను దేశకాలములఁ జూడక శౌర్యమున కుద్యమించుట యనువగునా? నీవీయడవివిడిచి చనిన మాప్రాణములు నిలువవుసుమా.

సాలం—సాహస మొక్కటి నిలుచుఁగాక కార్యసాధనమగునా? వలదీకార్యముదుగుసుమా.

చిత్రా—పితరులారా! నన్నేల నిర్బంధపెట్టెదరు? మిమ్ము వేఁడికొనియెద నానతిండు.

సుమా—సత్యవంతా! అందఱకుం జెప్పువాఁడవు నీకీయవివేకమేల? నీవేకాకిగా నిప్పుడు ధనువును గత్తియు బాణమును బాఁకును గొనిపోవ నేమొనర్చినట్లగు? అంచెవరో ఋషులు వచ్చుచున్నట్లున్నది. తాళుము.

[ప్రవేశము: జంబాలుఁడు. నందకుఁడు.]

జంబా—నందకా! అక్కడికే పోయిచూతము.

నంద—జంబలా! వీరే.

జంబా—రాజేంద్రా! నీచరిత్రమంతయు మేమెఱిఁగితిమి. భగవంతుఁడు మీకు మేలొసంగఁగలఁడు లెండు. రాజకుమారా! ఈసాహస మిప్పుడుజ్జగింపుము.

చిత్రా—సంయమీంద్రులారా! సర్వవిదులైన మీరాడుమాటలకు నేనేము త్తర మిప్పఁగలను?

మ. యతిలోకోత్తరులార చూచితిరె యీయన్యాయమెంతైననీ
గతి నేత్రంబులఁబోవఁగొట్టిన మహోక్రవ్యాదకృత్యంబున
య్యతిపాపాత్మునిఁగష్టమానసుని ఘోరాయోధనక్రీడసం
హతుఁగావింపక యూఱడిల్లునె మనంబత్యంతదుఃఖంబునన్.

జంబా—కుమారా! ఎందును గృష్ణపక్షమును శుక్లపక్షమును గలుగుఁగదా! ఏలయోచించెదు. విధికృతము మీఱఁదరముగాదు. ఇందే మాయాశ్రమమున నొకపర్ణశాలలోఁ గొన్నాళ్ళుండుఁడు. నారాయణుఁడున్నవాఁడు.

(నిష్క్రమింతురు).

—() ప్రథమాఙ్కము సమాప్తము ()—

శ్రీ

# సావిత్రీచిత్రాశ్వనాటకము

ద్వితీయాఙ్కము-ప్రథమరంగము.

మద్రపురిలో నశ్వపతినగరు.

[ప్రవేశము: అశ్వపతి మాళవి].

అశ్వ—మాళవీ! మనసావిత్రి విషయమై నాకేమియుఁ దోఁపకున్నది. ఏమి చేయవచ్చును?

అనుబంధము 17.

వార్ధక షట్పది.

కాంతయేమని చెప్పఁగలుగు మనసావిత్రి
కింతపసితనమబ్బునే యెందునాసత్య
వంతుఁదక్కఁగనన్యుఁబరిణయంబాటకును
వలదనుచునున్నయదిగా.
యెంతచెప్పిన మానదేరాజ్యమెడలిగహ
నాంతరంబునవంతనడలొందునాసత్య
వంతుఁడెక్కడ తన్నుబరిణయంబగుటేడ
పరికింపదేయక్కటా.

మాళ—నాథా! ఇంతత్వరయేల? ఇపుడు మించిపోయినదేమి?

భామినీ షట్పది.

తడవ నేటికిఁబ్రాణనాయక
పడుచుదనమగుకతనసుతయా
నెడఁగుచందముఁబూనెవలదను విధమదేటికిఁబో
విడుతమొకకొన్నాళ్ళుపోయిన
నెడఁదనించుకబుద్ధిగనిగినఁ
బడఁతిమదియోచించితరతమ భావముంగనదే॥

అశ్వ—ప్రియా! దాదాఁపున నొకవత్సరమునుండియు బోధించుచున్నానే. ఘటకేతుని వలన జయింపఁబడి యరణ్యమున వసియున్న ద్యుమత్సేనుకొడుకుఁదప్ప నొరుల వలదనుచున్నదే. ఇఁక నెన్నాళ్ళకు బుద్ధిగలుగవలయు?

భామినీషట్పది.

కన్నియకుఁబదునాలుగేఁడులు
మొన్ననే కడచనెస్వయంవర
మన్ననొప్పక వలదువలదని యాడుచున్నదిగా
యిన్నినాళ్ళవివాహితగసుత
యున్నలోకమువారలేమని
యెన్నుదురోయనుభీతివొడమదె యింతకనుమబలా॥

ఈవిషయమున యోచింపనే యిప్పుడువచ్చితి.

[తెరలో ధ్వని.]

సరసిజాయతలోచనా-భవజాలబంధవిమోచనా

[ప్రవేశము: దాసి]

దాసి—దేవా! నారదులు వచ్చియున్నారు.

అశ్వ, మాళ — (లేచి నారదునిబిలిచికొని వత్తురు.

అనుబంధము 18.

నార—తరల॥ సరసిజాయతలోచనాభవజాలబంధవిమోచనా
గరుడవిశ్రుతవాహనాఘనకాయలోకవిమోహనా.
ద్విరదనాయకపోషణాపరవీరదానవభీషణా
సురసమూహమహావనాపరిశుద్ధసంశ్రితజీవనా॥

మాళ, అశ్వ — (నారదునికి నమస్కరించి యాశీర్వచనములఁ బడయుదురు)

కుసుమషట్పది.

నార— శుభమెయశ్వపతిమీ
కుభయులకుఁబుత్త్రికిని
సభవారికెల్లరకు సంతోషమే
యిభహయభటాదులగు
విభవంబులకునెల్ల
నభయంబెప్రజకెల్ల నానందమే॥

అశ్వ—సంయమీంద్రా! మీయనుగ్రహమున నంతయు సౌఖ్యము. మీయాగమనమున మాకు సర్వశుభములును గలిగె?

నార—మీరేమో యోచించుచున్నట్లున్నది.

అశ్వ—మునీంద్రా! మాపుత్త్రి సావిత్రి నిషయమై యోచించుచుంటిని.

నార—పుత్త్రివిషయమై చింతయేమి! సావిత్రి యెక్కడ?

అశ్వ—మాళవీ! పిలిపింపుము.

మాళ—ఇదిగో తలఁచుకొను వేళకేవచ్చెను.

[ ప్రవేశము: సావిత్రి ]

అశ్వ—రమ్మా! సావిత్రీ! నారదసంయమీంద్రులకు నమస్కరింపుము.

సావి—(నమస్కరించును)

నార—కల్యాణమస్తు (అని) అశ్వపతిరాజా! ఈబిడకు వివాహప్రయత్నము లేవియు నొనర్పలేదా?

అశ్వ—నారదా! మీరైనఁజెప్పుఁడీకన్యకు? మీరునెఱుఁగుదురుగదా సాళ్వపతియగు ద్యుమత్సేనుని యుదంతము? అతనికొడుకుం బరిణయమయ్యెద ననుచున్నది. ఎంతచెప్పినను వేఱొకని వలదనుచున్నది.

నార—అమ్మాయీ! అవునా?

సావి—సంయమీంద్రా! అదియే నాసంకల్పము.

నార—లోకమున నెవ్వరును ధనవంతునిఁ గోరుదురే! ఎఱిఁగి యెఱిఁగి నిట్టివానిఁ గోరుదువే?

సావి—మునీంద్రా! అదియంతయు నీశ్వరాయత్తము. ఎట్టివాఁడైనను నతఁడే నాపరదైవము.

నార—అత్తమామలంధులుగదా?

సావి—నాకొఱకే మైన నంధులైరా?

నార—అడవులలో నాకలములుదిని బ్రతుకుచున్నారే. రాచపట్టివి నీవెట్లోర్చుకొందువు?

సావి—ఆ సత్యవంతుఁడును రాచపట్టియేకదా? అతఁడెట్లోర్చుకొనుచున్నాఁడు?

నార—రాజేంద్రా! ఇంతవృథమానసమున్నప్పుడింకేల యోచింతువు?

అశ్వ—మునీంద్రా! నేఁజెప్పిచెప్పి వేసరితిని. అయినగతికానీ. పోనీ! ఆసత్యవంతుఁ డెట్టివాఁడు?

నార—రాజేంద్రా! ఎంతయనిచెప్పవలయు? అతఁడు రాజకుమారమాత్రుఁడు. కాఁడు చిఱుతవాఁడయ్యు నెంతయో ఖ్యాతిఁజెందినవాఁడు.

శా॥ ఆరూపంబుసరోజలోచనల కాహ్లాదంబుఁగల్గించునా
ధీరత్వంబరిహృద్భయంకరముగాదీపించునాసూనృతా
చారంబెవ్వరిఁగాని పెక్కునుడువక్ జంకించునాప్రీతియ
య్యారే మిత్రులనెల్లసోదరులఁజేయంజాలుఁగాభూవరా.

అట్టివాఁడింకొక్కఁడుకలుగునా? అయిన— (యోచించును)

అశ్వ—ఋషిసత్తమా! ఇంక నేమో చెప్ప నెంచితివి.

నార—విశేషమేమియులేదు.

అశ్వ—ఏమోచెప్ప నెంచి సంకోచించితివి. అది సత్యవంతుని విషయమైయుండి చెప్ప వచ్చునేని చెప్పుము.

నార—ఆ సత్యవంతుని గుణములఁ గొనియాడుతతి మనసున కొకవిషయము స్ఫురించె. అది వచించుటకై కొంకితి. అయినను బెండ్లికార్యమగుటచేఁ జెప్పకుండుట యనుచితము. అన్నియు మంచిలక్షములే కలపదార్థము లోకముననుండుట దుర్లభము. ఆ సత్యవంతునికిఁ బెండ్లియయిన సంవత్సరమునకు మృతిగలుగు విధి యున్నట్లు విన్నాను.

అశ్వ, మాళ — హా! హా! (అనిచెవులుమూసికొందురు.)

అశ్వ—సావిత్రీ! వింటివికదా? ఇంకఁజాలింపుము.

సావి—ఏమి చాలింపవలయు?

అశ్వ—ఇంకేమి? ఆసత్యవంతునిపైఁజింత.

సావి—అదియెన్నటికిని బోఁజాలదు.

అశ్వ—అయ్యో! పెండ్లియైన సంవత్సరమునకట్టి దుఃఖముగలిగిన నెట్లుభరింపవచ్చును?

సావి—నాప్రాప్తియనుకొందును.

అశ్వ—తనయా! ఇంతమూఢత తగునా?

సావి—అయ్యా! ప్రాప్తముఁ దప్పింప నెవరికి సాధ్యమగు. విధి యెట్లువ్రాసియున్న నట్లగు.

అశ్వ—కుమారీ! ఇట్టిచందముగలదా? బంగారుకత్తియని గొంతుఁగోసికొనఁబోలునే? ఈమాటాడకుము. చిఱుతతనమున నీవుముందువెనుకలు యోచింపక యెంతతప్పని పట్టుపట్టినను మేమూరక యట్లే పోనివచ్చునా? అతలఁపింక మానుము.

మాళ—నాథా! దీని నింతేల యడుగవలయు? చెప్పినట్లంతయుఁ బోనివ్వవచ్చునా? ఎనిమిది దినములలో లగ్ననిశ్చయముచేసి మాయన్నకొడుకున కిచ్చి వివాహము చేసినసరి. ఇంతటి తల పెద్దతనము లిప్పటినుండియున్న ముందుబాగగు.

(సావిత్రితో)

కం॥ కూఁతురటంచును జేతః
ప్రీతిన్నను నిన్నినాళ్ళు పెంచినవారిన్
నీ తలిదండ్రుల నెంచక
పోతరమునమాడలాడఁ బోలునెతన్వీ॥

సావి— ఉ. అమ్మకచెల్లకోపముననాడెదు పోతరమంచునాఁడెనా
నెమ్మదిలోన దైవగతినెంచితి మోహముసత్యవంతుపైఁ
గ్రమ్మఁజాలునేయదియుఁ బ్రాప్తముదప్పునెమీరలొప్పరే
నమ్మరొకన్యనై మనెద నామరణంబును మాటలేటికిన్॥

ఇంక మీరు నన్నెక్కుడుగా బాధింతురేని యెక్కడనైనఁ గూపముంజూచుకొనియెద.

మాళ—చింతయే తీరినది.

అశ్వ—అయ్యో! మాళవీ! ఊరకుండుము. ఇట్లేలందువు?

మాళ—అనక యేమిమటి? ఇంతచిఱుతప్రాయమున నింతపట్టుతగునా?

సావి—

(నిష్క్రమించును).

అశ్వ — కం. ధీరతయును బలుపంతము
సారుదలంపంగ నక్కజంబగు నిటులె
వ్వారువలదన్న మానదు
నారదయిక్కన్నె నేమనంగలవాఁడన్॥

నార— చ. అసదృశలీలనామదికి నద్భుతమయ్యె నరేంద్ర ధీరమా
నసగద యీవెలందివినినారమె యెందునునీచరిత్రవె
క్కసముగు నింతభక్తిగలకన్నియకెందు నసాధ్యముండునే
యొసఁగుముసత్యవంతునకెయోడకయీతరుణీలలామముఁ॥

మంచిచోట నేయీమెనిచ్చితిరి. సాక్షి సముఁదప్పింపనగునా? ఇంకయోచింపకుఁడు. భగవంతుఁడున్నవాఁడు.

మాళ— భగవంతుఁడున్నవాఁడే
యగునైనను దెలిసి తెలిసి యనుచితమగుపె
న్బొగరునఁ గూపంబునమున
గఁగనేభగవంతుఁ డేమొనర్చుంజెపుమా॥

నార—అమ్మా! అటుకాదు. నాకేమో యీతన్వికి క్షేమమేకలుగవచ్చునని తోఁచుచున్నది. నేనును నాయోపినకొలఁది సాహాయ్యమొనర్చెద. నే మఱియొకసారి వచ్చి సావిత్రితో మాటలాడి నిశ్చయించెద.

అశ్వ— నారదా! భాగ్యము. నీయనుమతి గలిగిన నదియె మాకుఁగర్తవ్యవిధి గదా?

(నిష్క్రమింతురు).

## ద్వితీయరంగము-అడవి.

[ద్యుమత్సేనుఁడు, సానంద, చిత్రాశ్వుఁడు, సుమాలి, ఋషులు,

(కూర్చుండియుండ)].

చిత్రా—చూచితివా సుమాలీ! ఈయరణ్యావాసమే యెంత సంతోషకరముగా నున్నది. పవిత్రములగు కుశాముల సేకరించి, యంతశ్శత్రువుల హరింపఁజాలిన నియమానుష్ఠానము నుపాసించి, పర్ణశాలలో నధివసించి, సాంగోపాంగముగా నిత్యకర్మ విధి నిర్వహించి, పావనులగు ఋష్యాదుల యనవరత సాంగత్యమున మించిన యీయరణ్యావాసమునకు, కామాద్యరిషడ్వర్గమునకు స్థానభూతమగు నిల్లను చీఁకటి నూఁతిలో ధనార్జనరోగబాధితులై గర్వాంధకారమునఁ గన్నుగానక పాపకృత్యములొనర్చుటకు నాస్పదమిచ్చు రాజ్యసుఖ మెన్నటికైన నెనయగునా?

సుమా—ఔరా! ఏమివైరాగ్యము! ఇదియభావంబుననే కలుగుట.

చిత్రా—అట్లేల?

సుమా—ఇప్పుడు నీకు రాజ్యమిచ్చిని. గంతులువేయుచుఁబోయెదవోలేదో.

ద్యుమ—సుమాలీ! ప్రొద్దెంతైనది?

సుమా—రాజేంద్రా! ఎక్కివచ్చుచున్నది.

చిత్రా—ఋషికుమారులారా! మాటలవశమునఁ బ్రొద్దుమఱచితిమి. ఇంక సమిత్కార్థము పోపుదమురండు. (అని ఋషులతో నిష్క్రమించును).

ద్యుమ—సుమాలీ! చిత్రాశ్వుఁడు వెడలెనా?

సుమా—వెడలిపోయెను.

ద్యుమ—నీవేమో యాలోచనము చేయుటకు వచ్చితినంటివి. ఇంతలోఋషికుమారులువచ్చిరి.

సుమా—రాజేంద్రా! నేఁటినుండి నాకు సెలవీవలయు.

ద్యుమ—ఎక్కడికిఁ బోయెదవు. సుమాలీ?

సుమా—సాళ్వపురికి.

సుమా—అయ్యో! అది ఘటకేతుఁడేలు పట్టణమే.

మ. పరివర్తించితి తోడనీడగముముఁ బాలించి కారుణ్యబం
ధురమైత్రిన్మఱవంగఁజేసితివి మాదుఃఖంబులన్నేఁడునీ
వరరే రాజకులాధముందు కడుకూరాత్ముండు దుష్కార్యక
ర్చురుఁడౌనాఘటలకేతుఁడున్నపురికింబోవంగఁగాంక్షించితే.॥

సుమా—రాజేంద్రా! నీమాట నాకుఁ బరితాపముఁగలిగించె. అనవరతము ననురక్షించుచుఁ దలిదండ్రులవలెనున్న మిమ్ముఁబాసి యామరాత్ముఁడగు ఘుటకేతు నొద్దను మనసారఁ బోవుదునా ?

కం॥ విడనాడుటమీసంగతిఁ
గడుకోరికగాఁగనేను గాంక్షించితినే
విడరానియొక్క యోజన
వొడముటఁబోయెద నురాజపుంగవవింటే ॥

ద్యుమ—అయ్యోడకుంబోయిన నిన్నాఘుటకేతుఁడు విడుచునా ?

సుమా—నేను వానినూరక విడిచినఁగదా ?

ద్యుమ—నీయాచనయైన నేమి ? ఏమిచేయనెంచితివి ?

[ ప్రవేశము: అశ్వపతి, మాళవి, సావిత్రి, ఒకఋషి ].

ఋషి—(అశ్వపతితో) రాజేంద్రా! ఇక్కడనేయున్నారురండు. (ద్యుమత్సేనునితో) రాజచంద్రా ! మద్రరాజగు నశ్వపతి భార్యయగు మాళవీదేవితోడను. పుత్త్రియగు సావిత్రితోడను, మీకొఱకు వచ్చియున్నాఁడు.

ద్యుమ—ధన్యుఁడనైతిని. అశ్వపతిరాజేంద్రా! నీకు స్వాగతముగుఁగాక, విజయము చేయుము.

సాన—మాళవదేవీ! సావిత్రీ! ఉపవేశమొనర్పుఁడు.

అశ్వపతి మొదలగు వారు. } (కూరుచుండుదురు)

సుమా—(స్వ) ఈకన్య నెక్కడనో చూచినట్లున్నది.

ద్యుమ—చం॥ అగణితశీల నీప్రజలకంతయు భద్రమె

అశ్వ— రాజచంద్రమా
భగవదనుగ్రహంబునను భద్రమెయా

ద్యుమ— మిగుల సుభిక్షమే
యగుఁగద రాజ్యమంతయును

అశ్వ— నట్టులెయా

ద్యుమ— నిటురాఁగఁగార్యమే
వగయొ,

అశ్వ— నరేంద్రమిమ్ముఁగనవచ్చుటె కార్యము

ద్యుమ— నేనుధన్యుఁడక్

సుమా—కం. ఒందితిగద,
అశ్వ— ఏమొందితి
సుమా— సందర్శనము
అశ్వ— అయిన?
సుమా— నింకఁజనవచ్చునె
అశ్వ— (స్వల్పకోపముప) నీ
వింద్రెవరవు
ద్యుమ— నృపసెపుము
తుందుముకీతండు నావిదూషకుఁడు
అశ్వ— ఆహా.
ద్యుమ—సుమాలీ! ఎంతవిదూషకుఁడవైనను గ్రొత్తగ మన యింటికభ్యాగతులై వచ్చి నవారి నిటుహాస్యము లొనరింపవచ్చునా?
సుమా—విదూషకుఁడెప్పుడును సత్యవాది. సత్యేతరము వానికి రుచింపదు.
అశ్వ—ఇక్కడ సత్యేతర మేమిగలిగె?
సుమా—రాజేంద్రా! కనలకుము. ఈద్యుమత్సేనుఁడు మీరువచ్చిన కార్యమేమన్న దర్శనముకొఱకువచ్చితిననుట సత్యమా?
అశ్వ—సత్యమేయగు.
ద్యుమ—ఉపచారమునకే యిట్లాడిన నంమన దోషమేమి సుమాలీ!
అశ్వ—రాజేంద్రా! నేనుపచారమున కన్నవాఁడఁగాను. నిన్నుదర్శించుటకేవచ్చితి.
సుమా—అట్లయిన రాజా! నీదేశమంతయు నీస్వాధీనమున నేయున్నదా?
అశ్వ—అదియెందుకడిగెదవు?
సుమా—భార్యతో బిడ్డతో నింతదూరమరణ్యమున నున్నవారిని సందర్శించుకొనుటకు వచ్చినారన్న
ద్యుమ—రాజపుంగవా! నీకూఁతురేలవచ్చియున్నది?
అశ్వ—సావిత్రీ! నీయత్తమామలకు వందనమొనర్పుము.
సావిత్రి— (నమస్కరించును).
సుమా—(స్వ) ఇప్పుడు తెలిసె. నిది చిత్రాశ్వుని పెద్దపులి. ఈఋషికుమారుఁడు మద్రరాజని చెప్పినను సావిత్రియని యాకుమారి పేరుచెప్పినను నాకుజ్ఞప్తికలుగదయ్యె.
ద్యుమ—మద్రరాజా! అత్తమామలెవ్వరు?
అశ్వ—నరేంద్రా! ఈయమ మీకోడలు కాఁదగియున్నది.
ద్యుమ—అయ్యో! ఇట్టిమేలమేల?

కం. దగదొట్టిమృగంబులలో
నెగరోజెడుమాకుఁగోడలేకోదువయగు
సుగుణాకర యీకన్నియ
యగుమాకోడలన మేలమాడుటగాదే॥

అశ్వ— తే గీ. మాతనూజ యెలమి మనసారఁగోరెనీ
తనయుఁ బెండ్లియాడ మనుజనాథ
పరిణయంబు పొందెవచ్చితి మిదియు ని
క్కమ్ముగాని కేరడమ్ముగాదు ॥

ద్యుమ— మనుజేంద్రా! నిను సంశయించి యాడినమాటకు ననుక్షమింపుమని వేఁడుకొనుచు నీమాట యెంతనమ్మదమనినను విధిబలమున మాకుఁగలిగియున్న దుష్ప్రాప్తిం దలంచిననింత సంతోషముమాకుఁగలుగునేయను సంశయముతప్పక పొడముచున్నది. రాజ్యభ్రష్టులమై యరణ్యమునఁబడియున్న మాకొయిట్టిశుభము?

అశ్వ— మానవేంద్రా! సంశయింపకుము. ఈకన్య నాకు సావిత్రిదేవి వరప్రభావమునఁ గలుగుట సావిత్రియనఁబరఁగు నీకన్యకు దైవయోగమున మీకుమారునిపై మదిగలిగియున్నది.

కం. అన్నన్న యరణ్యంబున
నున్నాఁడన రాజ్యమెఱుఁగ కున్నాఁడననే
మన్ననుజిత్రాశ్వుండే
మన్నాథుండనియె ధీరమానసకంటే

కావునఁ బరిణయంబొనర్చుటకే తోడ్తెచ్చితి. నాయాన విశ్వసింపుము.

సాన— సీ. అమ్మాయిసావిత్రిరమ్మందు[సరసకుఁబిలిచి]నీకుమా
తలనిమిరి
తనయుపై మదియెట్లు తవిలెఁ జెపుమ

సావి— యమ్మరో దైవయోగమ్మునఁ బ్రభవించె
ఘనమోహ మద్బ్రహ్మఘటనసుమ్ము

సాన— అత్తమామలమన్న నంధులమేమమ్మ
నేవపుట్టకకొల్వ నిచ్చగింతె

సావి— ఏవగింపఁగఁబాప మెనయదే శుశ్రూష
యొనరింతు నెపుడునా యోపినంత

సాన— యాకలములె మాకు నాహారమిందునీ
కేలీల రుచియింపఁజాలునమ్మ
సావి— పాలుపారవారలు భుజియింపఁ గలపదా
ర్థమెనాకుఁ బరమామృతమ్మగాదె
సాన— వనిరాజ్యహీనుఁడై వనరువాని వరించి
యేమిసుఖంబునీ వెనసెదమ్మ
సావి— సతతంబు భక్తిమైఁబతికిని శుశ్రూష
సలిపెడు సౌఖ్యంబె చాలదమ్మ
ద్యుమ— అలివేణి నీవుమాయమ్మవుగానిన్ను
దిలకింపఁ గన్నులు గలుగవకట.
సాన— యింతటి పతిభక్తి యొసఁగునే పరమాద్భు
తమునించె నీచరిత్రములతాంగి
సావి— తే. గీ. తల్లి నన్నింత కొనియాడఁదగునెనీకు
నెనయెపుడమిఁ బతివ్రత లనెడువారు
పాయకీ కనుంగనఁగట్టు పటమెనీదు
మహిత ధీరపాతివ్రత్య మహిమఁజాటు.

ద్యుమ—ఆహా ! దైవమునకిప్పుడు మాపైఁ గరుణగలుగునట్లున్నది. సానందా ! మన మీయడవులలోఁబడిన యిడుమలన్నియు నేఁడేతీఱె.

అశ్వ—రాజేంద్రా! ఇంకాలస్యమేటికి? ప్రయాణమున కాయితముకండు. మీరందఱు మావీఁటికి విచ్చేసి నన్ను గృతార్థుఁగావింపవలయు.

ద్యుమ—రాజచంద్రా ! నీయాదరణమగణ్యము.

ఉ. పెక్కువగాఁగనించితివి విశ్రుతభంగి నక్కై తవంపుఁబె
న్మక్కువమైన నీమనవిమాత్రమొనర్పఁగవిన్నవింతునేఁ
డక్కట రాజ్యబాహిరులమై కనుఁగన్నులు గానకున్నమే
మెక్కడపెండ్లికై యరుగుటెక్కడ మమ్మఁక్షమింపుభూవరా॥

అశ్వ—

చం. విడువక భక్తిమైఁబురికి వియ్యమువారలనేగుదేరఁగా
నడుగుటనంగనైందు విధియాట వచించినంతెకాని మీ
యెడరులెఱుంగనే సమయమెంచియె వెంటనెనాతనూజనేఁ
డెడపకయిందెనీసుతునకిచ్చి వివాహమొనర్పఁదెచ్చితిన్॥

కావునన న్నే నీవు క్షమింపఁదగు. రాజేంద్రా! నేనియ్యెడనే నామహిత నిసుతున కొసంగి పరిణయ మహోత్సవ మొనరింప సర్వసన్నాహములతో వచ్చియున్నాఁడ? చతురంగబలములును రేఁపేరాఁగలవు.

అనుబంధము 20.

ద్యుమ—రాజచంద్రా! నాయెడ నీకవ్యాజకరుణగదా! నీయనుగ్రహమునకు నేఁ గృతజ్ఞుఁడనై యుండఁగలవాఁడ. కాని నీయెంచినంత మహోత్సవ మొనరించుటకు మే మెడఁబడ మనునందుకుమాత్రము నను క్షమింపుము. అరణ్యమున నాకలములు దినుచున్న మాకీమహోత్సవమేల? మాకుఁ దగినకొలఁది మర్యాదలు మాత్రమే యుండనిమ్ము. అదిగాక మాకుమారునితో నాలోచింపలేదు. ఇంతలోననే యతఁడు వచ్చును.

సుమా—రాజేంద్రా! నీకొడుకు నడుగవలసినపనియేలేదు.

ద్యుమ—సుమాలీ! అట్లగునా? వాఁడేమనునో?

సుమా—ఏమైన ననిన నాకొక యుపాయమున్నది.

ద్యుమ—,,పెండ్లిసందడిం బెండ్లికొడుకు నేమఱచిర'' న్నట్లంత యాతురతయేల?

సుమా—నేను తరవాదిని. నాకొక మంత్రము తెలియును.

ద్యుమ—ఏమిమంత్రము సుమాలీ?

సుమా—అదియొక్క నడుమంత్రము మంత్రము. చతురక్షరి,

ద్యుమ—ఏమిటిదది?

సుమా—,,పెద్దపులి'' ఇదియేమంత్రము.

సావి—(యోచించి జపికిఁ దెచ్చుకొని సిగ్గువడును).

ద్యుమ—పెద్దపులియేమి? నీమాటలు చిత్రములుగానున్నవి.

సుమా—పెద్దపులి మహాత్మ్యమింతని చెప్పవచ్చునా? దాని చర్మము మంత్రమూర్తియగు శంకరునకుడుగర. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు కూటములఁగల్పించి దీనియందుద్భవించిన యొకదాని రెండు పాదములను మఱియొకదాని మూడుపాదములును గొని నడుమ నెనుబోతు నాల్గుకాళ్ళ నిఱికించి త్రాసునకంటెంచిరి. ఛందశ్శాస్త్రజ్ఞులొక మనోహర వృత్తమునకు దీని పేరిడి పలుమాఱు వాడఁదొడఁగిరి. దానినించుక ముఖ భంగముచేసినఁ గలుగుదానికి మదపుటేనుఁగు పేరిడిరి. మఱియీపెద్దపులి నేర్పడు గణమును జంద్రున కిచ్చిరి. యోచింపఁగాఁ బెద్దపులియు నశ్వపతియు నొకటే గణముగదా? (తనలో) అయిన ,,అశ్వపతి'' ముఖభంగమైన శ్వపతియగుగాని గజ పతి కాఁజాలఁడు.

ద్యుమ—ఏమిసుమాలీ! నీయర్థములేనిమాటలు?

సుమా—అర్థమున్న మనకీయనర్థములుండునా? మీకేల? మీరింకఁ బెండ్లిపనులఁ జేయుఁడు నేనింతలో వచ్చెద. (నిష్క్రమించును).

## తృతీయరంగము-అడవి.

[ ప్రవేశము: చిత్రాశ్వుఁడు (సమిత్కుశలతో) ]

అనుబంధము 21.

చిత్రా—సీ. పరిపాలన మొనర్పఁ దరుగిరుల్ నిండిబ
ల్వౌఱపు నించెడిమహా విపినమయ్యె
ననయంబు రాజ్యతంత్రాలోచన లొసంగు
మంత్రులు శబర కుమారులైరి
జతఁగూడి వెన్నాడు చతురంగ బలములీ
మితిమీఱు కానన మృగములయ్యెఁ
గసిదీఱ వలచేతియసి ద్రిప్పి నఱుకాడ
శత్రువులీకుశల్ సమిధలయ్యె
తే. గీ. ఎన్నినాళ్ళని యారీతి నిన్నఁబోయి
నెవ్వగలడంతు నన్నింతఱవ్వసేయఁ
గ్రూర దైవంబు నకునెంత వైరమో యు
ఱుంగఁగటకటయెంతని యంగలార్తు॥

అకటా! ఎన్నిదినములని యీదుఃఖమనుభవింపవచ్చును. విధికింతక్కటికము లేనిభంగి యుండునే? నాతలిదండ్రులఁబాసి పోవఁజాల. ఉండి వారిదుఃఖమును జూడఁజాల. భోజనశయనాదులు మొదలుకొని యన్నికార్యములఁ గేవలము పరాధీనత గలిగించి బ్రదుకు నిరర్థకముగాఁ జేయుఁగా యంధత్వము? ఆగతి చూచినపుడంతయు హృదయము కుమిలిపోవుగదా? అక్కటా! అంధత నేమనవచ్చును! ఎట్టిరోగమైన నెట్టిబాధనైనఁ దాళవచ్చుఁగాక కన్నులు లేకున్నమాత్ర మోర్వఁదరముగాదు. తాఁజూడఁజాలమిచే వచ్చినవారిఁ దెచ్చిన వస్తువుల వీరెవ్వరిది యేమని యొరుల నడుగ వారు కసరుకొనునప్పుడు గలుగు బాధ నెన్నశక్యముగాదు. ఎల్లవేళల భుజియింపఁగల పదార్థములుగ్గడింప వలసివచ్చినందునకై యొరులు విసికికొందురో యని భీతిల్లి కలఁగుట చెప్పనలవికాదు. గ్రంథాంతర భావములు వినఁగోరి యొరుల జనువుమన్న మాకిప్పుడు తీఱదన్ననుడి ప్రాణములఁ దలఁకింపఁగలదు. ఎంతయవసరముగఁబోవలసిన పనియున్నను బిలిచికొని పోవువారు సందర్భింపని వేళ నయ్యో! యిటులయ్యె నేనని పడుసంతాపము వచింపఁదీఱదు, ఇట్టిపరాధీనతతో నాపితరులం వనరుచుండ వారి విడువఁగలనా—ముందుపోవఁగలనా?

సీ. రూపించి యొరుఁడింత చూపిచెప్పినఁగాని
తనవారిఁ బెరవారిఁ గనఁగలేమి
యిదియిట్టిదని లాతు లెఱుఁగఁ జెప్పినఁగాని
యేపదార్థము భుజియింప లేమి
పెఱవారు చదివిచెప్పినఁగాని సద్గ్రంథ
సముదాయ మింతైనఁ జదువలేమి
దయనొరుల్ గేల్వట్టి దారికీడ్చినఁగాని
యడుగులు నాల్గైన నిడఁగలేమి
తే. గీ. సంతతానంత దుఃఖమశ్రాంతభయము
నారత వ్యథయవిరత పారతంత్ర్య
మారయ ననిశంబు మరణంబె కోరఁజేయు
నంధతయయారె వలవదయ్యరుల కైన॥

అక్కటా! రాజ్యము గెలుచుకొన్నమాత్రముననే కన్నులుపోవఁగొట్టియస్వపురుఁద్రోయు క్రూరాసురాత్ము నెందైనవింటిమే? అట్టిపరిపంథి మెడపైఁ దలపెట్టుకొనియుండఁ బగదీర్పలేక యనాథగతినున్న క్షత్రియనామ మెందుకు? అప్పుడుగాదిప్పు డాఘట కేతుఁదెగఁదీయ నుంకించియు నంధజనకులఁ బాసిపోవఁజాలని వగ కే నేమిచేయుదు! ఆహా! రోదసీపరిభంగ కృజ్జ్యారావభీషణ కోదండమున కాలవాలమగు నాకేలిప్పుడీ సమిధలపైనుక్క చూపఁ జొప్పడియె. శత్రురాజుల కంఠసీమలపై దీవ్రభంగి దిరుగాడి వాఁడిచూపు నాకరవాలమిప్పటి కుశలపై వాఁడి చూపుచున్నది. హౌరా! విధికృత్యము? ఇవియన్నియు నటుండఁ బ్రాప్తమనియున్నంతలోఁ దృప్తిపొంది యుండుమనన్న నామనంబట్టిట్టు లల్లనాడుచు సంతత చింతాలోలమైయున్నది. ఎంత మఱితమన్నను సావిత్రిపైఁ జింతమానదు. అందనిమ్రానిపండ్లపైనాశయేలనియెంత యూఱడిల్లుదమన్నను నూఱడిల్లనివ్వదు. ఆ తన్విపై నింతమరులు పుట్టఁజెల్లునే? ఘోరారణ్యమున నాకలములుదిని బ్రదుకునాకును నా రాకాసుధాకరాననకును నెక్కడితారతమ్యము? ఆకస్మిక దర్శనమాత్రమున నంతతీవ్రమగు ప్రతిజ్ఞయొనర్చి నన్నుఁగాఁకొరులఁ గోరననియాచెలి వచించిన మాటలన్నియు నిక్కమని విశ్వసింప వచ్చునా? కామము క్షణములో నుద్భవించి క్షణములో నశింపవచ్చును. మోహమునుగొన్నిపట్టుల నట్టిదియేయగు. ఘోరారణ్యమున శార్దూలము తఱిమికొనివచ్చిన కాలమున నేనొనర్చిన రక్షణకృత్యమునకు మెచ్చి యప్పుడుద్భవించిన సంతోషమునఁ బొడమినక్షణిక మోహమున ముందు వెనుకలు యోచింపక యుబ్బియాకులుకులాఁడి యాడినమాటలన్నియుఁ దప్పనిమాటలని నేఁబాటింపవచ్చునా? ఇట్టియనియత స్నేహములు కనుదప్పిన వెంటనే నశింపవా?

ఉ. పన్నగవేణి నాయెడలబాళిరహింపఁగ నాఁడువెంటనే
తన్నువరింపుమంచుఁ దలిదండ్రులయొద్దకు రమ్మటంచున
న్నన్నివిధంబులన్ బిలిచెనక్కట యాతమినేఁడునుండునో
కన్నడచేయునో మరలఁగానఁగనైననులేదె దైవమా॥

నాఁడే యారమణీమణి తలిదండ్రులయొద్దకుఁ బోలేనైతిఁగదా? అయ్యో! రాజ్యము వాసి జననీజనకులతో నరణ్యాశ్రమనఁబడియున్న నాచరిత్రము విని యాలోల లోచన తలిదండ్రులు నన్నానలినానన చేపట్ట సమ్మతింతురా? సమ్మతింపకున్న నాయలివేణి యేమిచేయఁగలదు? ఇదివఱకే యాపంకేరుహాననకు వివాహమైయుండిన నుండవచ్చుఁగదా? నాపై మోహాతిశయమున నన్నువరించిన మాత్రముననే యుక్తాయుక్తములు విచారింపక యాతన్వంగి పితరులు సర్వలక్షణ సంపన్నుఁడైన వానికెవనికైన నాక్కన్నొసంగక యాటవికునిబోలెనున్న నాకొఱకై మీఁదెత్తియుందురా? ఇదేమిమాట? జగంబులేలు మహిమాతిశయముగల యేరాకుమారున కారమణీమణి యీవఱకర్ధాంగియై యనంతసుఖముల నిచ్చుచున్నదో. నేచేలనైపలవించుచున్నాఁడఁగాక. ఆహా! అపుణ్యాత్ముఁడెవఁడో?

సీ. కలవాణి బలుముద్దు పలుకులు వినఁగల్గు
పోలుపుగాంచిన మహా పుణ్యుఁడెవఁడో
యామించుబోణి కంఠాలింగన సుఖంబు
నలరఁగాంచిన సుందరాంగుఁడెవఁడో
హిమకరానన యాస్యకమలంబు ముద్దాడు
మహిమగల్గినయట్టి మహితుఁడెవఁడో
జలజాక్షి వెలలేని బలుమోహమునఁ నొద్దఁ
జేరుభాగ్యముఁగన్న ధీరుఁడెవఁడో

తే. గీ. యంగనామణి తనకు నర్ధాంగలక్ష్మి
యైయనంగ సుఖంబుల నలరఁజేయఁ
గొలఁదిమీఱిన యానంద జలధినోల
లాడనోచిన యామోహనాంగుఁడెవఁడో॥

అయ్యో! అపుణ్యమునాకుఁగలుగునని నమ్మితినే. ఏట్టితీఱని కోరిక. ఆయువంతమే యింక మఱువలేను. అయ్యో! ఎట్లుమఱవఁగలను? ఆరూపమును మఱతునా? ఆయాదరణము మఱతునా? ఆముద్దుమాటల మఱతునా? ఆయాలింగన సుఖంబు మఱతునా? ఆనాఁడిడిన వెలలేని ముద్దురుచి మఱతునా? దేనిమఱతు! ఏదిమఱచినను నాకాంతామణి మోహపుఁజూపుల నెట్లుమఱతు?

సీ. పులిరాకఁ బరువెత్తి నలుదిక్కులవిభీత
హరిణి నాఁగనినదెప్పరపుఁజూపు
ఎదురేగు ననుగాంచి మదిభీతియును బ్రేమ
గలయంగఁ గనిన బెగ్గలపుఁజూపు
పులిఁజంపి తెలిసియుఁ దెలియని గతినున్న
తఱినన్ను గని తత్తరపుఁజూపు
గనువిప్ప నొకయింత గమకించు వేళనఁ
దనివిమైఁగనిన బిత్తరపుఁజూపు
తే. గీ శ్రమము దీఱఁగ నేలేవఁ జాలిమాట
లాడనాకర్ణలోచన యనుటసార్థ
కముగ నానంద బాష్పముల్గ్రమ్మఁగఁగనిన
మగువ మోహంపుఁజూపునే మఱువఁగలనె.

కెండియు

సీ. వెడలి పోయెదనన్నఁ బ్రేమంబుఁ బొలయల్కఁ
బఱపు దైన్యముతోడి వాఁడిచూపుఁ
దనమాట కంటెమున్ననునిల్వుమని వేఁడు
పగిదిదెల్పిన నిడువాలుచూపు
నామోము మెఱిఁగింప నామోద మునఁగన్ను
లరమూసి కనిన యయ్యారిదిచూపుఁ
దనతల్లిదండ్రులొద్దకు నన్ను బిల్చుచో
మసినవ్వు వెన్నాడు ముద్దుచూపు
తే. గీ. తెరలి చనువేళఁ బలుమాఱు తిరిగితిరిగి
యడలి ననుఁజూచుచో నిట్టిదట్టి దంచు
నెంచరాని కడంగి వర్ణించరాని
మగున క్రేగంటిచూపు నేమఱువఁగలనె.

ఆ కలకంఠీమణి జాలలేని చెలువిప్పటికి నాకన్నులకుఁ గట్టినట్లయియున్నదే. ఏమి చేయుదును. (ఉస్సురని కూరుచుండి కన్నులుమూసి యొక్కింతూరకుండి) హా! సావిత్రీ! ఇన్నిదినములకు నీకనుగ్రహము కలిగెనా? శార్దూలమా! మాసావిత్రిం దటుము కొనివచ్చెదవా? నిన్ని కరవాలమున ఖండించెదను. (అనిలేచికన్నులువిచ్చి) అయ్యో! నాగతికేమనవలయు. కన్నులుమూసిన సావిత్రింగాంచుచు నిద్రలేని కలఁ గాంచుట యయ్యెఁగా? నాకెట్టిభ్రాంతి.

[ ప్రవేశము: వస్తున్నట్టున్న యొకవృద్ధబ్రాహ్మణుఁడు. ]

† మహోత్సాహ వృత్తములు ]

అనుబంధము 22.

బ్రాహ్మ— చాలబాధలొందినాఁడ శంకరశూలీ
చాలునన్ను గావుమింక శంకరశూలీ
యాలకించి దారిజూపి యాదరబుద్ధిన్
జాలిఁదీర్చువారులేరె శంకరశూలీ
రాతిరెల్లఁ గానలోన క్రూరమృగములక్రిందన్
భీతిజెంది కూడులేక వేఁగఁగనయ్యోన్
బ్రీతిజూపి లేరెనన్ను బిల్చెడువారల్
శాతరీతిఁగుందనయ్యో శంకరశూలీ.

ఎవరయ్యా యిక్కడ? సాళ్వపురమునకు మార్గమెక్కడనున్నది? చూపఁగలవా?

చిత్రా— నీ వెవరవు.

బ్రాహ్మ— వృద్ధబ్రాహ్మణుఁడను.

చిత్రా— అదిచెప్పనక్కఱలేదుగదా? ఏయూరు?

బ్రాహ్మ— మద్రపురి.

చిత్రా— మీరాజశ్వపతిగదా? అతనికి క్షేమమా?

బ్రాహ్మ— అతని పురోహితుఁడఁగదా?

చిత్రా— అతనికి సావిత్రియను కూఁతురున్నదే ఆబిడ సుఖముగా నున్నదియా?

---

† ఇది నాథనామక్రియరాగము-ఆటతాళము గల పాట వృత్తరీతిఁ జూపఁగాఁ త్రయోదశ ఛందంబున సమవృత్తము. అపూర్వము.

బ్రాహ్మ—అయ్యో! ఆయమకొఱకే నాకింత బాధవచ్చినది.

చిత్రా—బ్రాహ్మణా! అదియేమి ?

బ్రాహ్మ—ఆకథ నీకెందుకు? మార్గముచూపరాదా? లేకున్న నాకుఁదెలియదనరాదా ?

చిత్రా—బ్రాహ్మణా! నీవలసియున్నాఁడవు. కొంచెము విశ్రమింపుము. నేను నీవశ్యము సాళ్వపురి మార్గము చూపఁగలను. (సమీపమునకుఁబోవ)

బ్రాహ్మ—అయ్యా! ఏమిట్లు సమీపమునకు వచ్చుచున్నావు ? నిన్నుజూచిన భయమగుచున్నది.

చిత్రా—బ్రాహ్మణా! భయపడకుము. నే సద్వంశ సంభూతుఁడ.

బ్రాహ్మ—అయ్యో! ఇట్టి సద్వంశ సంభూతులే దారిలో మొన్న నాకుపనయవముఁ గావించిరి. నేబ్రాహ్మణుఁడనయ్యా! నాయొద్ద నేమియులేదుసుమా.

చిత్రా—అయ్యో! భూసురా! ఏటికిట్లు భయపడెదవు? మద్రపురీ వర్తాంతములు కొన్నినాకుఁజెప్పి పుణ్యముఁ గట్టుకొనుము. నిన్ను సాళ్వపురికిఁబంపెద.

బ్రాహ్మ—అయ్యా! దారిఁజూపుటకు లంచమడిగెదవా! నీచందముఁజూడ నీవు నన్ను సాళ్వపురికే పంపుదువో—యమపురికేపంపుదువో సంశయముగానున్నది. సమీపమునకు మాత్రము రాకుము. అంతయుఁ జెప్పఁగలను.

చిత్రా—బ్రాహ్మణా! ఇట్టిదియుంగలదా? ఇందే యుండెదలెమ్ము. కూర్చుండుము. సావిత్రికిఁగాను నీకు బాధగలిగెనంటివే యెందుకు?

బ్రాహ్మ—అదేల యడిగెదవు ? నీ వెవరవు ?

చిత్రా—నాసంగతి యటుండనిమ్ము. నేనడిగినది తొల్తఁజెప్పుము.

బ్రాహ్మ—నేమొదటఁ జెప్పను. కడకుఁజెప్పెదను.

చిత్రా—ఆమెకు వివాహమైయున్నదా ? (స్వ) హృదయమా! నిమ్మళింపుము.

బ్రాహ్మ—అయ్యో! ఆవివాహమునకే యీయవస్థ. ఆమె మిత్రాశ్వుఁడో—సత్రాశ్వుఁడో—

చిత్రా—చిత్రాశ్వుడు.

బ్రాహ్మ—ఔను చిత్రాశ్వుఁడు మఱి—నిత్యవంతుఁడో—మృత్యువంతుఁడో—

చిత్రా—సత్యవంతుఁడు.

బ్రాహ్మ—ఎవఁడో యెవ్వఁడెఱుఁగు? వానిపై మనసుగలిగియుండెను. తల్లిదండ్రులెంత చెప్పినను వినక మూర్ఖభావమున నుండెను.

చిత్రా—ఇప్పుడేమయినది.

బ్రాహ్మ—నే నేదో యుపాయమొనర్చువఱకు వదలకుండెను.

చిత్రా—ఇప్పుడు వదలెనా ?

బ్రాహ్మ—వదలియుండఁగనే గదా సాళ్వపురికిఁబోవుచున్నాను.

చిత్రా—సాళ్వపురి కెందుకు ?

బ్రాహ్మ—అందు ఘుటకేతుఁడను ధర్మాత్ముఁడు రాజ్యమేలుచున్నాఁడఁట. అతనికొడుకునకు సావిత్రినిచ్చి వివాహముచేయుటకు—ఏమయ్యా! అట్లుచూచుచున్నావు! నేను బీదబ్రాహ్మణుఁడసుమా నాయొద్ద నేమియులేదు.

చిత్రా—బ్రాహ్మణా! ఘుటకేతునికొడుకుఁ బెండ్లియాడుట కా సావిత్రి సమ్మతించెనా?

బ్రాహ్మ—నేనుండలేదా సమ్మతింపఁజేయుటకు ?

చిత్రా—ఏమి చేసితివి ?

బ్రాహ్మ—ఆ సత్యవంతుని సంగతి తెలుసుకొనిరమ్మని మద్రరాజు నన్నంపెను. పోయి నట్టుపోయి యేదోయొక సంగతిచెప్పి యాచింతబోఁగొట్టితి.

చిత్రా—ఏమిచెప్పివి ?

బ్రాహ్మ—అదియంతయు నీకెందుకు ? అదిగో ! మరల సమీపమునకు రాఁదొడఁగితివే నేఁబోయెదను (అని లేచుచుండ)

చిత్రా—బ్రాహ్మణా ! కూరుచుండుము. నే సరసకురాను. నిను నమస్కరించివేఁడికొందు నేమిచెప్పితివి చెప్పుమా?

బ్రాహ్మ—(కూర్చుండి) చేసిన పాపము చెప్పినఁ దీఱునందురు. కాఁబట్టి చెప్పెదను. ఆ సత్యవంతుఁడనువాఁడడవిలోనొకచెంచెతను మోహించి తగదనిచెప్పిన తండ్రితో జగడమాడికన్నులఁబొడిచి యంధునిగాఁజేసి యాచెంచెత నెత్తుకొనియెందో తెలియకుండఁబోయినాఁడని చెప్పి సరిచేసితి.

చిత్రా—(లేచి) హా! సాపాత్మా? పాఱుఁడవా? ఘుటకేతునికంటెఁ గ్రూరుఁడవు. నిన్నేమి చేసినఁదీరును ? (గొంతుపట్టును.)

బ్రాహ్మ—ఓరీ నీయింటఁ బిడుగుపడ. ఎంతపట్టుపట్టితివి? చిత్రాశ్వా ! (కట్టుకొన్న గడ్డమును, తలవెండ్రుకలను విడిచి సుమాలియగును).

చిత్రా—సుమాలీ!

సుమా—ఓ !

చిత్రా—ఏంత చిత్రముచేసితివి? ఇట్లేల యొనర్చితివి?

సుమా—నీవు వచ్చునపుడు వైరాగ్యమునిండిన మాటలాడితివి. ఆనాఁడు జరిగిన పెద్దపులి వృత్తాంత మెట్లున్నదోయని యిట్లుచేసితి.

చిత్రా—సుమాలీ! నాకెంత దుఃఖముఁ గలిగించితి? నీవురాకముందా సావిత్రినే కలువరించుచుంటి. ఎంత వైరాగ్యముఁ దెచ్చుకొన్నను నామోహముమాత్ర మంతకంత కగ్గలమే యవుచున్నది. నిక్కముసుమీ ?

సుమా—ఇప్పుడా సావిత్రియే నీయెడకువచ్చిన నెట్లుండుదువు ?

చిత్రా—సుమాలీ! ఇట్టినెఱవేఱని కోరికలేల పుట్టించెదు?

సుమా—ఇప్పుడున్న స్థితిలో నాయబలవచ్చినను వలదందువు కాఁబోలు?

చిత్రా—అయ్యో! మిత్రమా! ఆసతీమణి దర్శనమునకై యిప్పు డేమిచ్చిన నిత్తుఁగదా?

సుమా—సత్యవంతా! నేనిప్పుడా సావిత్రిం దెచ్చిన నాకేమిచ్చెదవు?

చిత్రా—సుమాలీ! ఏమనకు హాస్యము చేసెదవు?

సుమా—ఆసావిత్రి యిప్పుడు మనపర్ణశాలకే వచ్చియున్నది. పోదమురమ్మా.

చిత్రా—సుమాలీ! నీవు సమయము నెఱుఁగక నవ్వులాడెదవు సుమా?

సుమా—ఇంతకంటె నింకేమిసమయము? లగ్నమునకంతయు సిద్ధము చేయుచున్నారు. రమ్మా.

చిత్రా—ఇంకట్లాడితి వేని నాకుఁ గోపమువచ్చును.

సుమా—నేనందుకు ధూపము వేయఁగలనురమ్మా. (ఈడ్చును).

చిత్రా—(కోపమున) నేనిప్పుడురాను.

సుమా—నీవురాకున్న నేనుపోను (పట్టిలాగును).

చిత్రా—నీదేమి శనివేధనాకు?

సుమా—శనివేధయా? నీశని యిప్పుడేరాశినున్నాఁడు? ఇదివఱకు సింహరాశినుండెనో? ఇప్పుడు కన్యాముఖుఁడైయున్నాఁడు. మిథున దృష్టిగల్గియున్నాఁడు. మీతండ్రి పిలుచుచున్నాఁడు. పోవుదమురమ్మా. (పిలుచుకొనిపోవును).

---

ద్వితీయాఙ్కము-తురీయరంగము.

పర్ణశాలలో వివాహ వేదిక.

[ప్రవేశము: ద్యుమత్సేనుఁడు, అశ్వపతి (పీఁటపై) చిత్రాశ్వుఁడు, ఋషులు].

ఋషులు—(మంత్రములు చదువుచుందురు)

(సానందా మాళవులిద్దరు సావిత్రిం బిలుచుకొని వత్తురు).

మాళ—(సావిత్రిం జిత్రాశ్వ దక్షిణభాగమున నొకపీఁటపైఁ గూరుచుండఁబెట్టును. మంత్ర పఠనము జరుగును.)

అశ్వపతి } మాళవి } (సావిత్రిని దమచేతులతో నంటి)

సీ. నయశీలురార సానందాద్యుమత్సేను
లారమావియ్యమువారలార
సావిత్రి దేవి మహావరంబునఁబుట్టి
యెసఁగుసావిత్రి మాయేకపుత్రి
ననురాగమునఁ బదునాలేండ్లు పెంచిమీ
తనయునకొసఁగితిమనఘులార
మీకప్పగించెద మాకన్నె నేఁడుమా
తనయగాదింక మీతనయగాని
సావిత్రిని వారియొడిలో నుంచి)

తే. గీ. ముందు వెనుక లెఱుంగని ముద్దరాలు
అలతకోర్వని సుకవాసి యలసురాలు
కనలు లేకల్లనల్లనఁబనులునేర్పి
కరుణఁబాలింపుఁడో దయాభరణులార

ద్యుమ—రాజచంద్రా! మీరింత చెప్పవలయునా? మాతనయకంటె నింకింతెక్కు డుగాఁజూచుకొందుము.

సానంద
ద్యుమ }

సీ. ఘనశత్రు దుష్కృత్యమునఁ జిక్కులగుమాకు
సిరిసంగతియడంగ సరకుగొనక
తులలేనివలపూని మలయమ్మబలుప్రేమ
కలిమిఁగన్న పొలంతి లలినొసంగి
దయమానిలయమానతమనూనవిభవాతి
శయమూన వియ్యముసలుపువామ
నయనసావిత్రి మానయనమైనయరీతి
నన్వయంబుఁ దనరుమీరాదమఱవుఁ

(సావిత్రినింజూచి)

తే. గీ. డమ్మరావమ్మ మాయమ్మయన్నమిన్న
నిన్ను నోచమైతిమికాంచగన్నులార
చెట్టపట్టితి మాపట్టిదిట్టవౌచు
గట్టుపట్టిచేపట్టు నీబొట్టుఁగాచు.

1వ ఋషి—ఇంక వేళయయినది. లగ్నముసమీపించినది. (రెండు నిమిషములవఱకు నూరక పెండ్లి సంవిధానములు సేయుదురు).

1వ ఋషి—సుమంగలీరియం వధూరిమాగ్ం సమేతపశ్యా!
సౌభాగ్యమస్యైదత్వాయథా స్తం విపరేతన ॥

2వ ఋషి—దేవీంవాచమ జనయంతదేవాః। తాంశ్వరూపాః పశవోవదంతి।
సానోమంద్రేషమూర్జందధానధేనుర్వాగస్మానుపస్రష్టుఁతైతు॥

3వ ఋషి—ధ్రువంతేరాజావరుణో-ధ్రువందేవో బృహస్పతిః।
ధ్రువంత ఇంద్రశ్చాగ్నిశ్చరాష్ట్రంధారయతాంధ్రువం ॥

అశ్వపతి
మాళవి } (యిరువురులేచి సావిత్రింబిలుచుకొని)

కన్యాంకనకసంపన్నాం-కనకాభరణైర్యుతాం।
దాస్యామి విష్ణవే నేభ్యం-బ్రహ్మలోకజిగీషయా।
కన్యేమమాగ్రతోభూయాః-కన్యేమేదేహిపార్శ్వతః।
కన్యేమేసర్వతోభూయాః-త్వద్దానాన్మోక్షమాప్నుయామ్।
విశ్వంభరః సర్వభూత-సాక్షిణస్సర్వదేవతాః।
ఇమాం కన్యాంప్రదాస్యామి-పితౄణాం తారణాయవై

కన్యాంసాలంకృతాంసాధ్వీం-సుశీరాయసధీమతే ।
ప్రయతోహంప్రయచ్ఛామి-సర్వకామార్థ సిద్ధయే ।
శ్రీమన్నారాయణ స్వరూపాయ-శ్రీమద్ద్యుమత్సేనపుత్రాయ ।
చిత్రాశ్వాయ ఇమాంలక్ష్మీ-స్వరూపాంతుభ్యంప్రజా ।
నాహర్తుకామఃప్రతిపాదయామీతి-తుభ్యమహం సంప్రదదేనమమ ॥

(అని సత్యవంతునికి ధారపోయును.)

చిత్రా—,, దేవశ్యత్వాసవితుప్రసవే శ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణా ॥ (అని గ్రహించును).

3వ ఋషి—ఇంక నలుగులు హారతులు కానిండు.

1వ ఋషి—విశేషముగా ముత్తయిదువులు లేరె?

సుమా—నేనుండలేదా? పెద్దముత్తైదువను. (మాళవి. సానందలు హారతి పళ్లెరములు పట్టుకొని అందఱు పాటఁబాడుదురు),

## అనుబంధము 23.

—() ద్వితీయాఙ్కము సమాప్తము ()—



శ్రీ

# సావిత్రీచిత్రాశ్వనాటకము

## తృతీయాఙ్కము-ప్రథమరంగము.

పర్ణశాలముందటి స్థలము.

[ ప్రవేశము: చిత్రాశ్వుఁడు, సావిత్రి (నడచుచు). ]

చిత్రా— అలివేణీ! చూచితివా? ఇప్పుడీవనంబున మనకించుకైన దుఃఖమనిపించదు. ఎంతో సంతుష్టి పొందియున్నాము. ఇదియంతయు నాలోచింపఁగా నహంకారామలచేఁ జిక్కిన యెఱుకలేని మానవులు సుఖదుఃఖంబుల తారతమ్యము లేమేమో యెంచెదరుగాక, గగనోన్నతములగు సౌధసీమలయందు బంగారుతూగుటుయ్యాలలో మణిభూషణములు పట్టువలువలుధరించి •యసమానుఁడని విఱ్ఱవీగు రాజునకును, ఇరవులేకడవులలో నెల్లవేళల వర్షాతపములకు జడియక కౌపీనమాత్ర వసనుఁడై యుండు నాటవికునకు నించుకైన భేదములేదని తోఁచుచున్నదికదా?

సావి— ప్రాణుల కలవాటు పడినట్లంతయు, దాననే సంతుష్టికలుగును. సంతుష్టియే సుఖమునకు మూలము.

చిత్రా— ఇదిచూచితివా? ఈపక్షులేవియో కడుదుఃఖమునఁ బోవుచున్నవి.

సావి— ఇవి చక్రవాక దంపతులుఁగదా?

చిత్రా— మఱియేమిట్లున్నవి?

సావి— సాయంకాలమయినందున దీనభావముఁ బొందినవి?

చిత్రా— ఆహా! అప్పుడే సాయంసమయమాయెనా? ఔనుగదా?

మ. ద్యుమణిశ్రీచరమాద్రిఁ గ్రుంగ ఖగసందోహమ్ములిమ్ముల్గ్రొలార్క
దమిమై శ్రేణులుదీరి పాఱఁగడు సాంద్రంబయ్యెకోలాహలం
బుమహోదగ్ర మృగార్భటమ్ములడరె [illegible] మోఁగెన్దివాంధారవ
మ్మమితంబైయినుఁడేగఁజూగు వనకాంతాక్రందనంబోయనన్

సీ. వేసవిమిన్కులవేల్పు వెడలపంటవలంతి
చలిపోవఁదొడఁగు కంబళమనంగ
మరునయ్యఁగొల్వసమయకాంత పేర్చిన
జాంబవ తులసీకదంబ మనఁగ
హరితిరోధన ప్రచ్ఛన్న దానకలిత
ద్విరదానఘుల్బణ తెంచెననఁగ
చెలిగుబ్బలుల వీడిచిలువతేని బలం
బొడయుఁజేరఁబఱపొంది డాసెననఁగ
తే. గీ. నింగిఁబొంగు మబ్బులిలకుడిగ్గద్రావ
నెలమిఁజెలరేఁగి పురివిప్పి కలయఁబాఱి
నర్తనమొనర్చు బర్హిణ సార్థమనఁగఁ
దమముసాగెఁదమికొనుచు దచ్చికడల.

సావిత్రీ! ఏ సాంగత్యంబున దినమొకనిమిషముగాఁ జనుచున్నదిగదా?

సావి— ఆహా! ఆవృక్షమెంత ఘనముగానున్నది?

చిత్రా— తరుణీ! ఆవృక్షము నాకొకజ్ఞాపకము గలిగించుచున్నది. నీవు మీతండ్రి మొదలగువారితోఁ దొల్లిఁ బర్ణశాలకు వచ్చినదినము నేను విరహవేదనచేఁ దపించుచు నాచెట్టునీడను విశ్రమించియుండఁగా నామిత్రుఁడు సుమాలి ముదిబ్రాహ్మణునివలె వచ్చి యెంతో వేడుకచేసియుండెను.

సావి— అయ్యో! ఆసుమాలి వలదన్నను వినక సాళ్వపురమునకుఁ బోయియున్నాఁడే. అతని కంటకపాటు గలిగెనో?

చిత్రా— సావిత్రీ! అతఁడఘటనఘటనాసమర్థుఁడు. ఏదైనను సాధించుకొనిరాఁగలఁడు.

సావి— అతఁడుపోయి యెన్నిదినములో యాయెంగదా?

చిత్రా— ఏదీ?— ఒక సంవత్సరమైనను గాలేదు. మనవివాహమైన మూఁడుదినములకుఁ బోయెను. వివాహమయి నేఁడష్టమిగదా? రేపుద్వాదశికి సంవత్సరము కాఁగలదు. ఆహా! సావిత్రీ! ఏమిట్లులికిపడితివి?

సావి— ప్రాణకాంతా! మఱేమియులేదు. ఏదోయొకటి జ్ఞాపకమునకువచ్చిన భయము గలిగెను.

చిత్రా— ఏమి జ్ఞాపకము వచ్చెను.

సావి— ఇప్పుడేమియులేదు.

(లోపల ,,సత్యవంతా'')

చిత్రా—వచ్చితిని. మాతండ్రి పిలుచుచున్నట్లున్నది. పోయివచ్చెదను. (నిష్క్రా)

## అనుబంధము 24.

సావి—అకటా! నాప్రాణనాథుని సాంగత్యముననుండి యంతయు మఱచియుంటిఁ గదా? ఇప్పుడు చెప్పనలవిగానిభీతి నామదికిఁ గలుగుచున్నది. ఆనాఁడు నారదుఁడు నాకాంతుని వివాహమయిన సంవత్సరమునకు మృతిగలుగువిధి యున్నట్లు గదా చెప్పెను? నేఁటికి నాల్గుదినములు తక్కువగా సంవత్సరము కావచ్చెను. నేనేమిచేయుదును? ఎందుఁజొత్తును? ఇఁక నాల్గుదినములకు నాకేమిగతి రావలసియున్నదోకదా? అయ్యో! నేనింకెక్కడికిఁబోదును? (అనిలేచి తిరిగి కూర్చొనిలేచి) నిష్ప్రదొక్కిన చందమున నాకాలెందును నిలువకున్నదిగదా? ఏమియుఁదోఁపకున్నది ఇఁక నేనేమి చేయఁగలను. నారదఋషి యానతిచ్చినతీరున నీ నాల్గుదినములు శుద్ధోపవాసముచేసి తదుపదేశిత మంత్రము పునశ్చరణ సేయుదును. పిదప దైవమున్నాఁడు.

కం॥ వరనారద నుడువులలీ
లరమణుఁగోలుపడనాకిలన్ బ్రాణముదు
ర్భరముననుఁగావదిక్పా
లురవేలుపులగిరిజన్ బలుమఱుఁదలంతున్ ॥

(నిష్క్రా.)

## ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.



### సంయమునిపురి యమునికొల్వు.

[ ప్రవేశము: యమదూతలు, చిత్రగుప్తుఁడు, యముఁడు.]

అనుబంధము 25.

యమ—చిత్రగుప్తా? ఈప్రాణియేపాతకముచేసియున్నాఁడు ?

చిత్ర—రాజా ! ఇతని పాపములపరిమితములు-హాస్యమునకైన నిజము చెప్పినవాఁడు కాఁడు-కలనైన దైవచింతయెఱుఁగఁడు-బ్రాహ్మణుఁడైయుండి మద్యమాంసములఁ బాలువెన్నలవలెఁ జూచుచు వచ్చినాఁడు. సాధు దూషణమన్న నితనిశరీరముతోఁ బుట్టినది-పూర్వజన్మ సుకృతపుణ్యమునఁ దగినంత గొప్ప యధికారముగలిగి యంధ మతుఁడై జీవరాసుల క్షేమమించుకైన యోచింపక లంచములుగొని జనక్షేమమునకు భంగము కలిగించుచు వచ్చినాఁడు. అదిగాక మహాకామియై—

యమ—చిత్రగుప్తా! ఇవివల్లించి యేమిప్రయోజనము మొదట ఘోరమయిన పాతక మేదో దానిఁజెప్పుము. దానికి దండనవిధించి పిదప నితరములు విచారింతము.

(నేపథ్యమున „వాసుదేవా ! నారాయణా ! దామోదరా ! హరే”)

[ ప్రవేశము: సేవకుఁడు. ]

సేవ—ధర్మరాజా ! ద్వారమున నారదఋషులువచ్చి కాచియున్నారు.

యమ—కొంచెము తాళుమనుము. జీవవిచారమున నున్నాను.

చిత్ర—ప్రభో! ఈజీవుని పాతకములలో నిదిఘోర మిదికాదని చెప్పుటకు సాధ్యము కాకున్నది.

యమ—అయిన నేదయిన నొకదాని వచింపుము.

చిత్ర—రాజా! తనయాస్థానమునకువచ్చిన యొక యభియోగమున నుభయులయొద్దను ద్రవ్యముహరించి యుభయుల యిండ్లను బాడుచేసియున్నాఁడు.

యమ—దూతలారా! వీని కాలసూత్ర నరకమున నధోముఖముగా నొక సంవత్సరము వ్రేలఁదీయుఁడు. పిదప మరలఁగొనిరండు నిన్నటి జీవులన్నియు నింతతో ముగిసెనా.

చిత్ర—నేఁడు తొలిజామునుండి వచ్చిన జీవులున్నవి.

యమ— పిలిపింపుము.

చిత్ర—శంఖా ! నేఁడు వచ్చినజీవులఁ గొనిరమ్ము.

యమ—కింకరా ! నారదులఁ బిలువుము.

[ప్రవేశము: నారదుఁడు.]

అనుబంధము 26.

యమ—(వందనముచేసి) నారదా! నేఁడేమి బహుదూరము వచ్చియున్నావు.

నార—కొన్ని సంగతులు నీవలన నెఱుఁగఁగోరి వచ్చియున్నాను.

యమ—సర్వవిదుఁడవైన నీకుఁ దెలియని విషయమున్నదా?

నార—జీవులపై నీశాసన మమోఘముగదా? అయినను ఏజీవముఁగాని నీవుహరింపక విడువవచ్చునా?

యమ—నారదా! ఆస్వాతంత్ర్యము నాకెక్కడిది?

నార—జీవము హరించిన పిదప మరల జీవదానముచేయు స్వాతంత్ర్యము నీకుఁగలదా?

యమ—అదియునాకులేదు. అయినను, సురజ్యేష్ఠుఁడగు బ్రహ్మ నన్నియధికారమున నియమించుచో నట్టి జీవదాన సామర్థ్యమెప్పుడైన నొకప్పుడు కలుఁగఁజేయ ననుగ్రహించినాఁడు.

నార—ఆస్వాతంత్ర్యమును నీవెప్పుడైనను వినియోగము చేసియున్నావా?

యమ—నారదా! జీవకోటుల పుణ్య పాపవిచారమునఁ గరుణయెఱుఁగని న్యాయరీతి నవలంబించి యుండఁగా నాకట్టి పక్షపాతముగలుగుట కాస్పద మెక్కడిది? ఇది యంతయు నిప్పుడేల?

నార—సాళ్వరాజగు ద్యుమత్సేనుని కుమారుఁడు చిత్రాశ్వుఁడను వాఁడు—

చిత్ర—రాజా! అపేరిప్పుడే నాపుస్తకమునఁ గన్పించుచున్నది.

నారా—ఎందుకు?

చిత్ర—ఈసాయంకాలమున కొత్తనిమ్మృతి కావలసియున్నది. దూతలఁబంపుచున్నాను?

యమ—ఆ చిత్రాశ్వుని విషయమేమి?

నార—ధర్మరాజా! నేను నిన్నొక్కటి వేఁడుకొనెదను. ఎన్నఁడుగాని నిన్నే కార్యమునకుఁగాని వేఁడలేదుసుమా?

యమ—అదియేమి?

నార—ఆచిత్రాశ్వునిభార్య సావిత్రిలోకవందిత పాతివ్రత్య విఖ్యాత. ఆమెపై నాకు మిక్కిలి యక్కటికము గలిగినది. నీవెట్లయిన ననుగ్రహించి యామెకుఁ బతిదానము సేయవలయు.

యమ—నారదా! ఇదేమడిగితివి?

అనుబంధము 27.

చం॥ సురముని నీవెఱుంగవశె శోధితపాపవివేచనాధృతి
న్నిరతము దండనంబొసంగ నేనుమునేనిటనిల్పుపెల్లమా
యురె రహిధర్మ శాస్త్రి నిడనోదయాహ్వవిదిజ్ఞులోర్తురే
వెరవిదియబ్బె నోటునను వీడ్కేడి సేయని దే నమస్కృతుల్॥

ఈ కార్యమెన్నటికినిఁ గాఁజాలదు.

నార — కరుణించి యెట్లయిన నీకార్యముఁ జేయవలయు.

యమ — నీకు నమస్కరింతును అట్టికరుణయుఁ బక్షపాతమును నాకెన్నటిని గలుగదు.

నార — కరుణలేనిధర్మము కటికధర్మముగదా ?

యమ — చిత్రగుప్తా ! ఇప్పుడెన్ని జీవులు తేఁబడినవి ?

చిత్ర — ఎనిమిదివేల యాఱునూటనాలుగు

నార — ధర్మరాజా ! నినువేఁడి —

యమ — మఱి యొకరినొకరి రానిమ్ము

నార — ధర్మరాజా!

యమ — చిత్రగుప్తా ! ఈసాయంకాలమున కింకెన్ని జీవులు రావలసియున్నవి!

నార — శమనా!

యమ — పుణ్యాలవమున్న వారిఁ దొల్తఁదెమ్ము

నార — కృతాంతా ! నేనుబోయివత్తునా ?

యమ — చిత్రగుప్తా ! ఇప్పుడేవచ్చెదను. నారదా ! అభివాదనము. (నిష్క్రా)

నార — ఆహా ! ఎంత కాఠిన్యమీ యమునికి? ఇతఁడు నాకొనర్చిన యవమతికి శపింతుఁ గాని — ఏటికి ?

(యవనికపడును)



## తృతీయాఙ్కము-తృతీయరంగము.

సత్యలోకము బ్రహ్మసభ.

[ప్రవేశము: బ్రహ్మ, ఋషులు, నారదుఁడు.]

అనుబంధము 28.

బ్రహ్మ—తనయా! నారదా! ఇందుకు నేనేమిచేయఁగలను.

నార—జనకా! ఎట్లయినఁగరుణింపవలయును. చిన్నతనమునుండి యింతయుత్తమభక్తిగల పతివ్రతకు లోకమున నత్యధికమైన ఖ్యాతినిలుపకున్న నేమిప్రయోజనము? జగత్కర్తవగు నీకసాధ్యమేదికలదు?

బ్రహ్మ—పుత్రా! ఇతరుల యధికారగౌరవమున కొత్తుడుగలుగునట్లు మేము వర్తింప వచ్చునా?

నార—తండ్రీ! ఇదేటిమాట! మార్కండేయునకై భక్తవశంకరుడైన శంకరుండిదే యముని యుక్కడంపలేదా?

బ్రహ్మ—నారదా! నీవేమతియొకసారి యమునినుద్బోధించి—

నార—జనకా! నావలనఁగాదు. అతఁడొనర్చిన యవమతికి నేను శపింపవలసియుండెను. ఏమో పోనిచ్చితిని, ఇదిమాత్రము నీవు చక్కఁజేయక తప్పను.

బ్రహ్మ—సనందనా! ఏముసేయవచ్చును.

నార—జనకా! సంకల్పమాత్రమున జగత్సృష్టి యొనర్చు నీకగోచరమగు విషయమున్నదా! ఆయమునియందు నీవేకరుణారసమును జనింపఁజేసినఁదీఱుఁగదా!

బ్రహ్మ—నీమాటనిక్కము ఇప్పుడేయధికశక్తిచే నిండుకరుణను సృజించెద. కరుణా!—

[ప్రవేశము: కరుణ (స్త్రీరూపమున).]

అనుబంధము 29.

కరుణ—కం॥ వనజాసన ధాతనిను
గొనియాడఁగ నలవియే మగునునాచేఁగా
నానవకార్యం బెద్దో
పనిఁబంపుమిదెప్పనివిందుఁబావనచరితా.

బ్రహ్మ—కరుణా! ఇటురమ్ము. శాఖశాఖలుగా నేర్పడి సర్వప్రాణి మానసములనింతింతగానున్న నిన్ను నేఁడొక యాకారముగా సృజించియున్నాను. నీవలన నొకపని కాఁదగియున్నది. చేయుదువుగదా!

కరుణ—ధాతా! ఇటు నీవాడిన నేనేమిచెప్పఁగలను.

బ్రహ్మ—లోకమునను న్న సర్వదుఃఖములఁ బాపుటకు నీవేకదా కారణభూతవు. ప్రతిప్రాణి మానసమునందుగాని నీవు నెలకొనిన నతనివలన సర్వజనులకు నుపకారమే నరింపింతువుగదా? ధర్మగుణమునకుఁ బశ్చాత్తాపమునకు నీవుగదా గురుభూతవు. నీసాన్నిధ్యముగలిగిన నెట్టిజనులుగాని యెట్టిదుష్కృత్యములనైనఁ జేయఁగలరా? లోకమున నున్న యంధులకు, బధిరులకు, పంగువులకు దేహమనోజాడ్య పీడితులందఱకు నీవుండకున్న పరిణామముగలదా? నీవు ప్రవేశించిన నెట్టిఱాతి గుండెనుగాని వెన్నపూసవలెఁ జేయఁజాలవా? ధర్మమార్గంబున సంచరింపఁగోరు న్యాయాధిపతులందఱు నిన్నుఁగదా తొల్తనుపాసింపవలయు. రసాల సుసాల నవనవ ప్రవాళ కమనీయ కోమలమూర్తివై, శ్వేతాచల, శీతాచల, రాకాధిప, లోకాధిప, కరిచందన, హరిచందన, కులుకు పాలుపు తళుకుల శెలికిఁ జిమ్ము పాలుపాకు చిలుకల పలుకుల వెలసిన కలికివై యలరారు నిన్నుఁగని నమస్కరింపని వారెవ్వరు? ఇతర విషయములనెల్ల నిష్ప్రయోజకులని తెగడఁబడిన యెందఱో నీమహిమమాత్రముగలిగియుండుటఁజేసి కృతార్థులు కాలేదా? అట్టివారి నెందఱిని నీవు దేవలోకమున కెక్కింపలేదు? స్వర్గసౌఖ్యముల పొందఁగోరు మానవులకెల్లదివ్యలోక నిశ్రేణివి నీవేగదా? శక్తిగల ప్రాణుల మానసముల నీవుమాత్రము నిండియున్న లోకమున నెట్టిదుఃఖములును గలుగఁజాలవు. కలిగినను అవి దుఃఖములనిపించవు. నిన్నుపాసించిన వారి కందఱికిని సర్వసమత్వముఁ గలిగింతువుగదా? నినుఁ గొనియాడఁదరమా? మానవులకు మానవత్వముఁ గలిగించునది భూతదయయే. అట్టిభూతదయకు నీవేకారణమవు. సద్గుణములని యేవి యేవియెన్నఁబడునో వానికన్నిటికి నీవేమూలమవు. నీసాక్షాత్కారముగలిగిన వాఁడుచేయు సర్వదానములవల్లను దాతృప్రతిగ్రహీతృల నుభయులును రంజింపఁజేయుదువుగదా?

కరుణ—ధాతా! నీవునన్నింత ప్రశంసచేయవలయునా? ఇప్పుడు నాకాజ్ఞయేదికలదో యానతిమ్ము.

బ్రహ్మ—ఆహా! నినుస్తోత్రముచేయుట నీవిచ్ఛయింపవు. ఇది నీయందుఁగల నైజగుణము కావున నేను చేయునెన్నిక నీకంతరుచికరముగాకుండినందుకు సంతసించెదను. ఈ నాపుత్రుఁడు నారదుఁడొకపనికై నన్నాశ్రయించిన నిన్ను సృజించితిని. మందుకైనఁ బక్షపాతమెఱుఁగని నిష్కారుణ్యమునఁ గఠినుఁడని జగమునంతయుఁ బొగడుగన్న యమునియందు నీవవతరించి యీనారదుఁడు విన్నవించు కార్యమొనర్పవలయు.

కరుణ—విధాతా! నేనవశ్యము చేయుదును. సంకల్పమాత్రమున లోకసృష్టినొనర్చు నీవునన్ను సృజించి నాయందు వజ్రమువంటి మానసముసయితము నేయువలెఁగర గించునట్టి శక్తినిచ్చియుండ నేనాకార్యము చేయుదునన్న నిందులో నామాహాత్మ్య మేమున్నది? అంతయు నీప్రభావమేకదా?

## అనుబంధము 30.

(యవనికదిగజారును)



## తృతీయాఙ్కము-తురీయరంగము.

### అ డ వి.

[ప్రవేశము: సత్యవంతుఁడు]

### అనుబంధము 31.

సత్య — ఈతరుణికి నేమిపిచ్చిపట్టియున్నది. మూఁడుదినములనుండి శుద్ధోపవాసముచేసి నేఁడైనను పారణ మొనర్పకున్నది. అత్తమామలు నెంతో,బతిమాలిరి. నేనెంతో చెప్పితిని. ఈఘోరమగు ననశనవ్రతమునకేమి కారణమో చెప్పకున్నది. అత్తమామల శుశ్రూషయందుఁగాని, నాసేవయందుఁగాని యించుకైన భేదముగనుపడదు. ఈనాఁడాతరుణీమణి రూపమంతయుమారి ముఖము కళాహీనమై చెమరుపట్టిన చందముఁ దోఁపఁజేయుచున్నది. నాలుగునాళ్లు కటిక పస్తుండిన నింకెట్లుండును! నేనెంతనుఁ దన్నుమాని పోవరాదని నాతోఁజెప్పుచున్నది. నావివాహమై నేఁటికి సంవత్సర మాయెఁగదా! ఈదినమువఱకు నిట్టిచంద మీయింతివదనయందుఁ జూడలేదు. ఈ చరిత్రమంతయు నగమ్యగోచరముగా నున్నది. ఇప్పుడు నాకేటికో మనమునఁ గళవళము పట్టియున్నది. ఏమియుఁ దోఁపకున్నది. లోకమంతయుఁ బాడయియున్నట్లున్నది. తలయందున్న నాడులన్నియు నూరకకొట్టుకొనుచున్నవి. శరీరమంతయు గంపింపఁదొడఁగెను.

### అనుబంధము 31 a.

ఇప్పుడు మూఁడుజాములకాలమైయున్నదిగదా? ఈసూర్యుఁడు మాసిపోయిచంద్రునివలెఁ గన్పించుచున్నాఁడు. ఇదియేమి నాఛాయలో నాశిరము కానరాకయున్నది. కన్నులుఁ మూసికొని వచ్చుచున్నవి. ఏమోభ్రమగలిగి యున్నది. (చెవిలో వ్రేలిడి) కొంచెమైననుఁ గర్ణనాదము వినరాలేదు. ఏమిది? ఈమరణసూచకములన్నియు నున్నట్టుండి కనుపింపసాగె! అకటా! ఇఁక నాతలిదండ్రులను నానీడపలెననవరతము భక్తితోఁ బరిచరించుచుండిన నాయర్ధాంగలక్ష్మి నెవరు పోషించువారు! ఊరక నేనేల భీతిల్లుచున్నాను? ఇవియన్నియుమరణసూచకములనియనుకొనుటకైన నేమికారణము? ఎట్టిదేహబాహ్యముగాని లేదు. అహా! ప్రాణులకు మరణభీతియెట్టిది? ఎట్టిధీరులను దల్లడిల్లఁజేయుఁగదా! అధికమగు మనోధైర్యము పెంపున మృతియన్న నించుకయిన జంకెఱుఁగని యీచిత్రాశ్వునిశరీరమే యిట్లయిన నింకేమనవలయు? ప్రాణులారా!

మానవుఁడు పుట్టియుండుట చచ్చుటకొఱకేగదా? చావునకు భయమేలయని మీ రప్పుడప్పు డనుకొందురు కొంబోలు. అనుకొనుటమాత్రమే కాక కాలమాసన్నమై నప్పు డీధైర్యమంతయు నెక్కడకో పోవుసుఁడీ! కావున నెంతఁగాని తరుణో పాయమును జూచుకొనక మూఢగుణమున భవితవ్యతను నమ్మియుంటిరా సుఖింపఁ జాలరు. (లేవఁబోయి) ఆహా! యేమిది లేవఁజాలకున్నాను? ఆకామినీమణి తను విడిచి పోవలదని నాతోఁజెప్పినమాట సరకుసేయకఁ బాసివచ్చినందువలననే యుం డునా నాకీప్రాపికలుగఁబోవుచున్నది? నాకు నేఁడిట్టిబుద్ధియేలపుట్టె. ఎవరది? అయ్యో! సావిత్రి యిక్కడికేవచ్చెఁగదా?

[ప్రవేశము: సావిత్రి]

తరుణీ! ఇక్కడికేలవచ్చితివి. ఏటికిట్లు మూరభావంబున నీనాలుగుదినములనుండి శుద్ధోప వాసము చేసియున్నావు? నేఁడేల కొంచెమైన మనసున నెమ్మదిలేనిభంగి సంచ లించుచున్నావు? మిక్కిలిదీనవై వగచుచున్నావు? ఇటు తపియించుట నీకుఁ దగునా?

అనుబంధము 32.

శా. రోలంబాలక నీముఖాబ్జమిదె యశ్రుల్గ్రాతివాడొందెనీ
లీలన్ జూడవిషాదభంజితమనోలీనంబుఁ జాటించుఁగా
జాలింజెందుకతంబదేమొ యుపవాసమ్ముల్గడింపంగనే
లాలాంపట్యమదేలనిందెలమిమైయని శ్రాంతమేనుండఁగన్॥

రమణీ! నాతలిదండ్రులను విడిచి యేలవచ్చితి?

సావి — వారి శుశ్రూషనంతయుఁ జేసియే వారియనుమతిఁబొందివచ్చియున్నాను.

చిత్రా — కామినీ! నీతోఁజెప్పక వచ్చినందుకు నన్నుక్షమింపుము. అనుశ్చింతకు ఫలము సయితము నేనప్పుడేపొందితిని. నామనసంతయుఁగళవళమై లోకమంతయు మునిఁగి నట్టె మహావేదనంబు నాకుఁగలిగెను. అదియోర్వఁజాలక పర్ణశాలకు రావలెనని యుండఁగా నీవేవచ్చితివి.

సావి — అయిన శీఘ్రముగాఁ బర్ణశాలకుఁబోవుదము. సాయంకాలమువుచువచ్చె.

చిత్రా — పోవుదము. (లేచి-వడఁకి-కూర్చొని) ఆహా! కాంతామణీ! ఏనిమిది? నా శరీరమంతయుఁ గంపమొందఁగా లేవఁజాలకున్నాను. నామెడ నిలువకున్నది. గడియసేపునకుముందు సింహసత్వుఁడనైయున్న నేనిప్పుడెంత హీనసత్వుఁడనై యున్నాను. అకటా! తలయంతయుఁ దిరుగుచున్నది. కొంచెము పండుకొందును. (సావిత్రియంకమునఁ బండుకొని) అలివేణీ! ఈసంకటము నేనెట్లు భరింతును? అకటా! ఎన్నఁడు నేనెఱుఁగసుమా?

[ ప్రవేశము: యమదూతలు.]

సావి—అహా ! నాకింకేమిగతి ?

[ ప్రవేశము: యముఁడు, దూతలు.]

యమ—ఇదేమాశ్చర్యము !

దూత—ధర్మరాజా ! ఏమిచెప్పుదుము? ఎట్టిప్రాణులనైన నవలీల గ్రహించు మాకు వాని యొద్దకుఁబోవుట యశక్యమైతోఁచి పోవలేకపోతిమి.

యమ—అయినఁ బోదమురండు. (అని చిత్రాశ్వనియొద్దకు వత్తురు).

చిత్రా—అయ్యో ! భయంకరము దైవమా ! (చచ్చును).

సావి—(లేచి) మహాపురుషా ! ఇట్టియద్భుతాకారమున వచ్చియున్న నీవెవరవు?

యమ—(ఆశ్చర్యమున) తరుణీమణీ ! నీమహిమ మద్భుతము. ఎవరికినిఁ గోచరింపని నన్నుఁ గనుఁగొంటివి. నేను పితృపతిని. ఈసత్యవంతుని ప్రాణహరణార్థమై వచ్చియున్నాను.

అనుబంధము ౨౩.

సావి—ఉ. సన్నుతులోలిసల్పెద విచారపయోధి మునింగియార్తనౌ
నన్నరులూని తేల్చి నిజనాథునజీవుఁగఁ జేసికావవే
బన్నముధర్మరాజదయఁబాపుముకాంతునిఁగోలుపోయిన
క్రొన్ననబోణిజీవనము రూపముమాసిన చిత్రలేఖయా॥

అకటా !ధర్మరాజా! నమస్కరించి వేఁడికొందు నను గాపాడుము.

యమ—తరుణీ ! ఏమివేఁడి యేమిప్రయోజనము. కాలము నెవ్వరుగాని తిరింపఁజాలరు. ఊఱడిల్లుము. (సత్యవంతుని ప్రాణముహరించి) కింకరులారా ! ఈజీవముంగొని రండు. (వెలుపలికిఁబోవ సావిత్రివెంబడించుచు) (వెనుకకువచ్చి) తరుణీమణీ ! నావెంట నెందుకువచ్చెదవు. రాకుము.

సావి—ధర్మరాజా! నీకుఁ గరుణలేనియప్పుడు నేనేమిచేయుదానను. నాగతికోలఁది పోయెదను. (పోయివత్తురు).

యమ—

అనుబంధము 24.

శా. బాలాకాలగతిఁ దలంగఁదరమే ప్రత్యాశసీకేలను
ద్వేలంబాపరితాపమాఱ్చిమనుమా విశ్రాంతచిత్తోన్నతిఁ
శైలాగ్రాత్మజభక్తిఁగొల్చుచు వితానాత్తోడి వాగ్వాదముల్
చాలఁ జాలవిధాతృనాజ్ఞ నిపుడుల్లంఘింప శాతోదరీ ॥

కమలాక్షీ ! నీవెంట తలసి యేమిప్రయోజనము పొమ్ము.

సావి — కృతాంతా పతియున్న చోటికిఁ బోవక సతియెందుచోటికిఁబోవునా? నేను వచ్చి యేమిప్రయోజనమని యేలయందువు? అన్నిమార్గములను ధర్మమార్గముగదా శ్రేష్ఠము. అట్టిధర్మమునకు సత్పురుషులే మూలము. ధర్మాధిదేవతా సార్వభౌముని నిన్ను దర్శించుకొన్నపిదప నాకు శుభముగలుగక పోవునా?

అనుబంధము ౨౫.

కం. నాతి, పతివెనుఁ జనస
ద్గతియొకవెనిఁక నెటకేఁగఁగలనేవిభుమా
నితిరమ్మగనినుఁబోలిన
పూతచరితలఁగనినంతఁబొసఁగుశుభంబుల్ ॥

యమ — (స్వ) ఏమిది? ఎన్నడులేనిభంగి నాకిప్పుడు గొంచెముకొంచెము కరుణగలుగుచున్నది? (ప్ర) అబలా! నీప్రాగల్భ్యమునకు సంతసించితిని. నీపతిప్రాణముదప్ప నేదైనను వరమడుగుమిచ్చెదను.

సావి — సంయమనీశా! నాపతివిడిచి నాకువేఱొకకోరిక కలుగునా? అయినను మహామహుఁడవైన నీవు వరమిత్తునన్న మానరాదు. నాయత్తమామలు రాజ్యభ్రష్టులై యంధులై యరణ్యమున దుఃఖించుచున్నారు. వారికెప్పటియట్ల కన్నులను, రాజ్యమును గలుగునట్లను గ్రహింపుము.

యమ — మగువా! ఇచ్చితిని. ఇంక మగిడిపొమ్ము. (వెలికిఁబోయివత్తురు) అంగనామణీ! ఏల నామాటవినకున్నావు? (అగ్గియేఱు కొన్పించుచు) చూడుమా! ఇది వైతరణీనది? దీనిదాఁటి రాఁజాలవు.

సావి — పరేతనాయకా! నేనేమిచేయుదును? నాప్రాణకాంతునిఁబాసి మనఁజాలను. దీనిని దాఁటలేకున్న నిందే దహింపఁబడుదును.

(యముఁడు దాఁటును సావిత్రియు దాఁటును).

యమ — ఔరా! యీతన్వి మహిమ మద్భుతముగానున్నది. రమణీమణీ! కాలగతి నెవ్వరు తప్పింపఁగలరు. ఇంక నీపతిప్రాణముయాతనాశరీరమున నెలకొల్పఁబడును. నీ వేమిచేసినను రాఁజాలదు.

సావి — దేవోత్తమా! ధర్మదేవతవగు నీవెఱుంగని ధర్మములున్నవా? దీనరక్షణము ధర్మాత్ములు చేయకుందురా! నాపాపవిశేషంబున నీకుఁగరుణరాదుగాక దేవతాతిలకుఁడవై, జగదీశుఁడవై, ధర్మపాలుఁడవైన, నీకసాధ్యమేదికలదు?

అనుబంధము 25.

చం. అరుదుగ ధర్మసూక్ష్మముల నారయుఁ భూనుత నేత వాఁడుగా
శరణనశాస్త్రవాహితతిసైతముఁ బార్థివులాత్తిఁబాపికా
తురసదమై విరాళి మెఁటొక్కటఁదీర్పఁగ వేఁడునోర్తుపైఁ
గరుణయొకింతలేక నెతఁగాఁటియపెట్టఁ గృతాంతపాడియే ॥

యమ—కాంతామణీ! నీవచనామృతధారలచే నాయంతరంగమంతయు సమ్మోదము వహించెను.

అనుబంధము 37.

ఉ. మెచ్చితి నీవచస్సరణి మేదినిపీఁ గెడి వాలుగంట్లమేల్
గచ్చులడంచు నీప్రవిమల ప్రమనీపతిభక్తి పెంపునీ
కిచ్చక మౌనమతొందు వరమిందమదెద్దియొ మానినీమణీ
క్రచ్చుఱఁగోరుమా ప్రియుని ప్రాణముఁదక్కసమర్థవైఖరిక్ ॥

నీపతి ప్రాణముదక్క నింకేమైన వరము వేఁడుము ఇచ్చెదను.

సావి—ఇనతనయా! వరమిచ్చెదనన్న నేను గాదనను. నాతండ్రి పుత్రసంతానములేక-

యమ—నూఱుగురు కొడుకులనిచ్చితిని. ఇంకరాకుము పొమ్ము. (పోయివచ్చి) అమ్మా! నీకీహఠయోగ మెక్కడ లభించెను. ఇది నాపురము. ఎవరికినిఁ బ్రవేశింప సాధ్యము కాదింకఁబొమ్ము.

సావి—మార్తాండతనుజా! ఎన్నఁడుగాని నాపతిని నేను పాసిపోవఁజాలను. వచ్చినంత దూరమువత్తును. ఎక్కడికి సాధ్యమైన నక్కడనే నాయంతముకాఁగలదు.

యమ—అయిన నీయిష్టము. కింకరా! లోపలికివచ్చి పురీకవాటముమూయుము.

కింకర—అంతకరాజా! ఇదేమిచోద్యము? ఎంతబలము వేసినను తలుపు గదలకయున్నది.

యమ—(ఆశ్చర్యమున స్వగతము) అహా! పాతివ్రత్యమహిమచే నీలోకంబున సాధ్యము కానిదేది? అది యట్లుండఁగా నాకీమెనుఁజూచినప్పటినుండియు దేమి దైవాయత్తమో యెన్నఁడులేని కరుణ యుప్పతిల్లుచున్నది. బ్రహ్మ నాకొసంగిన స్వాతంత్ర్యము నైనను నేఁడు వినియోగముచేయు బుద్ధికలిగియున్నది. అటుచేయుట పక్షపాత మగుఁగదా? అదియుఁగాక నారమునితో నటు చేయనని చెప్పియున్నాను గనుకఁ దగదు. (ప్ర) తరుణీ! నీవనింద్యచరిత్రవు. అయినను నేనేమియుఁ జేయఁజాలను. మగిడిపొమ్ము.

సావి—యామ్యదిగీశా! నేనెక్కడికిఁబోను. వివాహమైనది మొదలుదయమున మేలుకొన్న వెంటనే నిత్యవ్రతముగా పతిముఖదర్శనము చరణాభివాదనము మానక చేయుచున్న నేనుమగిడిపోయి ఈఁ పెట్లుతాళుదును? అతనితోడిగతియే నాకుఁ గానిమ్ము. మఱియు మఱియు నీవు నాకేమియుఁ జేయఁజాలవని వచించుట నా పాపము వలననే కాక నీకుఁ జేయరానిదేదికలదు,

శా. పాపం బొక్కడెఱుంగ నీవకరుణాపాథోధిగా వేనమః
గాపాడందగదయ్య నావిపులదుఃఖం బాఱవేనంప వే
యాపన్నావన సత్పథంబు సదపాంగా లోకలేఖాప్తినే
వాపోవంగనవేడ్కయానె యబలన్వైవస్వతా ప్రోవవే॥

యమ—ఆహా! నేనింకఁ గాఠిన్యము వహింపజాలను. కాంతారత్నమా? నీయట్టి పతి భక్తిగల తరుణుల నేనెన్నఁడు నెఱుంగను.

అనుబంధము 38.

శా. కాంతామానసవీధిఁజొచ్చెఁ గరుణాకాంతుల్నవోద్యచ్ఛవిన్
వంతల్మానుమిదిచ్చితీవడుగక న్ప్రాణేశుఁ బ్రాణంబులన్
శ్రాంతిన్బొందుమిఁకమ్మ నీదుసుచరిత్ర ఖ్యాతిలోకోత్తరా
నంతస్ఫాతిమహద్విభూతికిరవా నాచంద్రతారార్కము॥

లోకమునందలిపతివ్రతలనువారందఱు నీ కాలిధూళిఁబోలఁజాలరు. నినుఁగని యత్యంతము సంతసించితిని. ఇపుడు నీవడుగకుండనే నీపతి ప్రాణదానమిచ్చియున్నాను. కైకొనుము.

సావి— సీ. వైవస్వతవఱలెశ్వ శురవంశమువిగత
నయనోద్ధారణ మొనరఁగనతి
భూతదాక్షిణ్యముప్పొంగ యామ్యాధీశ
శతపుత్రశాతంబు పితలకొసఁగ
శమననారమణుఁ బ్రాణముమరల్పి మనుప
విమలాత్మసమవేతశమముదనరె
ధర్మరాజముగుదనర్మిలిలాలించిరాటుమా
వఁగధర్మ రాజ్యమమరె

తే. గీ. విన్నఁగన్నసీమహనీయవన్నె లెన్న
దక్కినపుదిక్కు కెకిమీఁడచిక్కుచక్క
డంచివాంఛమన్నించి నబ్బెంచితంచి
తరుచిహరువుమీఁ అమటిజోహారుసారి॥

ధర్మరాజా! యిప్పుడుగదా ధన్యనైతిని.

## అనుబంధము 39.

యమ — కింకరా! ఈయాతనా శరీరమునుండి జీవముఁదప్పించి మరల సత్యవంతుని శరీరమున నుంచిరమ్ము. (కింకర — నిష్క్రమి)

సావి — సూర్యపుత్రా! అయిన నాకుసెలవా?

యమ — తరుణీ! నాభార్యనుఁజూచి పోయెదుగాని రమ్ము.

సావి — ఇనతనయా! పరదైవమగు నీమాటజవదాఁటుదునే? అయినను నాపతి మఱలఁ బ్రాణవంతుఁడై నేనులేకున్నఁజూచి యేమనుకొనునో! ఎంతదుఃఖించునో కదా?

యమ — అదే యతని దుఃఖమునకుఁ గడగాఁగలదు. కొంతసేపులోననే యతఁడున్న యెడకు నన్నుఁజేర్చెదను. ఈవిమానముపై నెక్కిరమ్ము.

సావి — ధర్మరాజా? అరణ్యమున నాపతి నేలఁబడియుండ నేను విమానమునెక్కి రాఁజనునా? నడచియేవచ్చెదను.

యమ — అట్లనేకానిమ్ము.

(యవనికనెత్తఁగా నరకముకనుపించి, ప్రాణుల వికారమైన ధ్వని వినుపించును)

సావి — ఆహా! ఇదేమి మహారావము?

యమ — కామినీ! భయపడకుము. ఆవైపున నరకముల బాధలుజెందు ప్రాణుల యారావమది.

సావి — రవిపుత్రా! ఈనరకముల వివరముల నిన్నింతయడుగ వచ్చునా?

యమ — అవశ్యకముగా నిరూపింతును.

## అనుబంధము 40.

సీ. తరుణిగంటివె యిందు దురితవిమగ్నమానవస
మాజనిబిడనరకసమితి
కాలసూత్రమనంగఁ గ్రాలువిశ్వాసఘాతుకులు
రివడివెతఁ దూలఁగనిట

నసిపత్త్రమున నిందె యొసఁగుఁ గన్నెలనమ్ము
పశుతుల్యులసిధారఁ గాసినఁ గలఁ
బ్రబలుంగు భీపాకము బరతల్పగులు
కృకంపుఁగట్టులనిభపదోప

తే. గీ. హాతిఁబొంగులనిందు లంచములందిప్రజలఁ
గంటగించుపబులుములు కాకకోడి
వజ్రకంటకమున నిటవ్రాలువారు
హింసకుల రౌరవమున వేపిందుచించు ॥

తరుణీ! ఇది కాలసూత్రమను నరకము. విశ్వాసఘాతుక మొనర్చిన ప్రాణులనిందు మరిదీయుచున్నారు చూడుము. అది యసిపత్త్రమను నరకము. కన్యావిక్రయము చేసినవారి నిందు ఖండఖండములుగాఁ గోయుచున్నారు. ఇది కుంభీపాకము. పర స్త్రీతల్పగుల నిందు మకృకంబంబునఁ గట్టి యేనుఁగులచేఁ ద్రొక్కించుచున్నారు? ఇది వజ్రకంటకము. అధికారబలంబున లంచములఁ గొని పక్షపాతమున జనవిరోధ మొనర్చినవారి నిందు తీవ్రకంటకములచేఁ బొడుచుచు మగ్గంధమున ముంచుచున్నారు. ఇది రౌరవమను నరకము. జంతుహింస చేయు నధముల నిందుఁబడవైచి కుక్కలచేఁ గఱపించుచున్నారు. ఇదిగనుమా? యంధతమిస్రము. అసత్యవాదుల నన్నృతసాక్షుల నిందు చీఁకటినూతఁ బడవైచి క్రాఁగెడు సీసము పోయుచున్నారు. యిది చూచితివే! ఇది ప్రాయోపమను నరకము. ఇందు తనపతిఁ గాదని యన్యపురుషులఁ గలియు సతులు—

సావి—పితృపతీ! నేనిట్టి పాపము వినఁజాలను. ఇట్టి శిక్షలుండఁగాఁ గన్నుగానని మానవు లిట్లు విఱ్ఱవీగుచున్నారుగదా?

యమ—కామినీమణీ! కొనసమానవులకుఁ దర్వాతగదా తెలియును. వాచామగోచర మహిమాతిశయముఁగల యిట్టిశరీరమును సృజించి దానియందప్రతిమ ప్రభావుఁడగు జీవునునిచి యెట్టియజ్ఞానులకును మేలు, కీళ్ళు, పుణ్యాపాపములను వాని నెఱుఁగు నట్టులొనర్చిన భగవంతుఁడట్టి మేలుకీళ్ళొనర్చినందుకు ఫలాఫలములఁ గల్పింపఁడన్న నెట్టిమాట? తరుణీ! ఇదే నాభవనము. ఇందింత విశ్రమింపుము. నాభార్యను బంపుదును. (నిష్క్రమి)

సావి—ఆహా! ఈయమపత్నియగు శ్యామాదేవి సందర్శనము గాఁగల పుణ్యము నెంతని వర్ణింపచ్చును? అయినను నానాథుఁడా యరణ్యంబున మేలుకొన్న వెంటనే—

[ ప్రవేశము: శ్యామాదేవి.]

సావి—(లేచి) తల్లీ ! నీకభివాదనము.

శ్యామా—చెలియా ! ఉపవేశ మొనర్పుము. నాభర్తయగు శమనునివలన నీమహాత్మ్య మంతయు తెలిసితిని.

సావి—అమ్మా ! నాకట్టిమహిమగలదా?

శ్యామా—జగంబున నేవ్వరైన నీవలెనొనర్చిన వారున్నారా? నీవొనరించు పతివ్రతా ధర్మంబులు కొన్ని నీనోట వినఁగోరెదను.

సావి—శ్యామాదేవీ! పతివ్రతాతిలకమని జగంబునెల్ల ప్రసిద్ధిఁబొందిన నీయెదుట నే నేమి వచింపఁగలను. అయినను తాముప్రీతిచేసిన చిలుకపలుకులు వినినిచ్చయించు రీతిఁ బ్రేమచేనడిగినందున కొన్నిధర్మములు బాలభాషణంబులుగానించుకవచింతును. పతిభక్తిగలసతి పతియే పరదైవమని యెంచుచు, అతని సేవనమే శుద్ధవ్రతముగా మాహించుచు అతనిమాటయే వేదమంత్రమని తలంచుచు, అతఁడిచ్చిన పదార్థమే పదివేలని గ్రహించుచుఁ, అతనిపార్శ్వమువారి నందఱిని దనప్రాణబంధువులుగా మన్నించుచు, తోడికోడండ్ర నక్కచెల్లెండ్రవోలె భావించుచు, తొలిజామునలేచి పతిమోముదమ్మిఁ దిలకించి చరణములకభివందన మొనరించి చిత్తమెఱిఁగి వేళకు భోజనముగావింపించి పిదపఁ దా భుజించి, మందమేలము కైన నతనిహాస్యమాడక, అతనియాజ్ఞ లేకొకరువ్వయైన వ్రయమొనరింపక, అతఁడు కోపగించుకొన్న మదిఁ గుందక, మన్నించిన నుప్పొంగక సొమ్ములివ్వఁడని దుఃఖింపక, అలసినప్పుడు రోగి యయినపుడులేమిఁజెందినప్పుడు యిచ్చానువర్తనమున సేవలొనరించుచు, మారాడక దేశాంతరగతుఁడైనపుడునలంకారము లిచ్ఛగింపక తదాగమనమేకోరుచు, అన్యపురుషులతో వేడుకకైన నవ్వులాడక హితరీతి మెలంగుటయే ధర్మము.

శ్యామ—సావిత్రీదేవీ ! నీయుపన్యాసమునకు మిక్కిలి సంతసించితిని.

మ. అలివేణీజతలేరునీకుఁగల కాంతాళిన్మహాధర్మము
ల్కలవాణీమృదుభాషిత శ్రుతినవాలంకారతన్ దోఁచెనిం
తలసచ్ఛీల పతిన్గనన్నలరదే హ్యాత్పుష్కరంబుర్విని
న్వెలఁదుల్భక్తిఁ భజింప వారిగతిసావిత్రీపవిత్రంబగున్ ॥

ఇట్టి ధర్మములు నీకెవ్వరుచెప్పిరి.

సావి—శమనపత్నీ! నాకెవ్వరుచెప్పుమను. దైవయోగముచేఁ దొల్లినుండియు నిదిమనంబున నలవడియున్నది. అందుపై నారదఋషి కొన్నిధర్మములు వినుపించెను.

శ్యామా—సావిత్రీ! మఱచితి నీకొఱకై నారదుఁడు బ్రహ్మనువేఁడి కరుణారసమును సృజింపఁజేసి యాకరుణ నానాధునియందు వెలయఁజేసివట్టుతనతో నాకుఁగరుణతో వచించెనని నానాధుఁడింతకుముందు చెప్పెను. నారదునకు నీపై నెందుకింత—

[ప్రవేశము: యముఁడు నారదునితో.]

శమ—సావిత్రీదేవీ! వేళయయినది. ఇదిగో దేవమునియగు నారదుఁడును వచ్చియున్నారు. మనమింకఁబోవుదము. (నిష్క్రా)



## తృతీయాఙ్కము-పఞ్చమరంగము.

### అ డ వి.

[ ప్రవేశము[ చిత్రాశ్వుఁడు (నిద్రలేచి) ]

### అనుబంధము 43.

చిత్రా—సావిత్రీ! అహా! నాకెట్టి దుస్స్వప్నమువచ్చె? తలఁచుకొన్న నింకను భీతిగలుగుచున్నదిగదా? ఏమి గాఢాంధకార మిట్లున్నది? సాయంతనమునఁగదా యింటఁబండుకొంటిని! ఇప్పుడర్ధరాత్రమయినట్లున్నదే? ఇంతసేపిందేలయుంటిని? అయ్యో! సావిత్రి యెక్కడికిఁ బోయియున్నది? అంకతలముననున్న నన్నుడించి యెందుఁబోయెను? ఇందేదాఁపుననుండవలయు. వెదకిచూతుఁగాక (వెదకఁబోయి) అకటా? యేమిది కాళ్ళేమియులేవకున్నవి? ఇట్టియవస్థకేమి కారణము? ఎన్నఁడు గాని నన్నొక నిమిషమైనఁ బాసియుండని యీసుందరాంగి నన్ని యరణ్యమున నీ రాత్రిడించియెందుఁబోయియుండును? ఆహా! మాతలిదండ్రులయొద్దకుఁబర్ణశాలకుఁ బోయియుండవలయు? నేనిదినఅకుఁ బోవకయున్నందునమాతలిదండ్రు లెంత దుఃఖించుచుందురో? ఏమని యెంతురో? కన్నులుగానక చీకులవలె నన్నే చేకోలగానమ్మికొనియుండిన నాతలిదండ్రులకెంతో దుఃఖము గలిగించిన పాపాత్ముఁడఁగదా? సావిత్రి యక్కడికేపోయియుండును. నేనుఁబోయెదను—

కాదుకాదు. నాకీభ్రాంతి యేలగలిగె? మహాయాసమున నంకతలమున శయనించియున్న నిన్నియర్ధరాత్రమున నీయడవిని మాని తానొంటిగాఁ బర్ణశాలకుఁ బోవునా? ఎప్పటికినిబోవదు. ఇదియంతయుఁదలఁచుకొన్నఁ జెప్పరాని భయముప్పతిల్లుచున్నది. ఆతరుణీమణి లేకున్న నాకేమిగతి?

హా! కాంతామణీ! ఏలపలుకకున్నావు? నీవులేకున్న నాజీవమేటికి?

ఉ. మానినియెందుబోయె ననుమాని నిశీధినిఁజోద్యమయ్యెని
క్కాననవొంటిడించినెడఁ గానకఁదానెటకేగె నొక్కెకం
జాననదండలేకెడద నాభ్రమణమ్మెటు లేదనౌనిరు
ల్మెనెనసెఁ సుధాంశుముఖిఁ బేర్కొనుచేగెదఁబర్ణశాలకున్ ॥

ఈదుఃఖమున నేనిట్లు పనరుచున్న నెవరుతీర్చువారు? పర్ణశాలయొద్దకేనఁ బోయి విచారింతును. (నిష్క్రమి)

[ ప్రవేశము: ద్యుమత్సేనుఁడు-సానంద. ]

### అనుబంధము 44.

సానంద—అకటా! ఇంక దైవమా! మాగతియేమి? మూఁడుజాములకుఁ బర్ణశాలవిడిచి పోయినకొడుకు అర్ధరాత్రము మీఱియున్న నింకనురాలేదే? అయ్యో! నాల్గుదినములనుండి యుపవాసమున్న ముద్దుకోడలు పతియొద్దకుఁ బోయెదనని చెప్పి పోయినది యింకను రాకయున్నదికదా? దైవమునకు మేమేమపకారముఁ జేసియున్నాము?

ద్యుమ—అయ్యో! దైవము నన్నిటు వెక్కిరింపవచ్చునా? ఉన్నట్టుండి శత్రువుల వలనఁ బోగొట్టఁబడిన కన్నులు నాకీనాఁడు కలిగించి యింతలో నీమహాపదఁ దేవచ్చునా?

సానందా—కటకటా! నాథా! ఈయరణ్యమంతయుఁ దిరిగితిగదా? ఇంకేమి చేయవలయు?

ద్యుమ—మ. తగునాదీనులఁబాసిఁపోఁదనయకాంతారస్థలిస్వేఁకపోఁ
కగుణాఢ్యుండవు దేహయాత్రదఁగునీ కైదండడగ్గ

సానంద......................................శుభ.

ప్రగుణాజ్ఞానససారసత్వముడిగెన్మాకీవుతొల్గన్వగ
న్నెగలెక్కి ప్రభవం బెమాయుడుజనీశ్రీమాకిలన్నిల్చునే

[ ప్రవేశము: సుమాలి (ఒకవైపునుండి). ]

అనుబంధము 45.

మానినీవృత్తము.

సుమా—అబ్బురమయ్యెడిసంధులు దంపతులాశ్రమమున్విడనక్కట పె
న్మబ్బునవారభిమంత్రణమారిటఁబల్కరుచెల్లదు మార్గణము
బ్బిన తామసినాతియు నాథుఁడునిక్కువలోసరినట్టడవి
బెబ్బులివాత విభీషణలీలనుబాఱి వెతన్విలపించిరొకో॥

అయ్యో! యిదేమాశ్చర్యము. పర్ణశాలలో నుండవలసిన యంధ దంపతులీ యర్ధరాత్రమెక్కడికిఁబోయిరి? అకటా! నాకేమియుఁదోఁపకున్నది. కన్నులు గానని వారు వెలుపలికెట్లుపోయిరి? నేను తెచ్చియున్న సంతోషవార్త నెవరితో చెప్పుదు. అయినను వెదకి చూచెదను.

ద్యుమ—తరుణీ! అక్కడ నెవరువచ్చువారు?

సుమా—(ముందఱికివచ్చి) ఆహా!

ద్యుమ—సుమాలీ! ఎప్పుడువచ్చితివి? ఏమిట్లు భయపడెదవు!

సుమా—ఇప్పుడు నాయెనుటనున్నవాఁడు ద్యుమత్సేనరాజా?
ద్యుమ—సుమాలీ ! ఏలసంశయించెదవు ?
సుమా—మీకన్ను లెట్టువచ్చెను ?
ద్యుమ—దైవమునన్నిటుల నవ్వులుచేయుచున్నాఁడు.
సుమా—కన్నులు వచ్చియుండుట నవ్వులుచేయుటయా? ఇంకేడుపులు చేయుట యెట్లు ?

[ ప్రవేశము: అశ్వపతి, మాళవి (ఒకవైపున) ]

అనుబంధము 46.

అశ్వ—సీ. అతివ యాశ్రమమునందతివయశ్రమము
నందతివంద్యులోఁడిరే ప్రతివచింప
మగువ రాజసుతుఁడే మగువ రాజసుతుఁడన్న
వగ దేఱనోకో తానగుచు రాఁడె

తెలువ సుందరగాత్రిపుత్రియే డెలువ
సుధావను ధవునిటఁదాను తేదె
యెలనాగ వేధనిందెడలె వెన్నెలనాగ వేధ
నిందుచుఁగందువిధిమనగతి

తే. గీ. చూడనల్లుడిలఁగల సవ్వడియెసున్న
యతికికలఁగి తానతియుచిచ్చుటికెనోకొ
బెడఁద బెగ్గిలి పెద్దలుమడసిరేమొ
బాము లెన్నిఁటిఁగన నౌనో మగువనేఁడు॥

అశ్వ—అకటా! మాళవీ ! అయల్లునిఁ గూఁతురిని నేనింకెట్లుచూతును ? నేఁటికిఁగదా వివాహమై సంవత్సరమాయెను. నారదఋషి యాడినమాట తప్పునా? ఈరాత్రి జాముపటుకుఁ బర్ణశాలయందేయుండిన యంధ దంపతు లిప్పుడెక్కడికిఁ బోయి యుండఁగలరు. మాళవీ! ఇదియంతయుఁ జూడఁగాసత్యవంతుఁడుమృతుఁడుకాఁగా మనసావిత్రియు నంతమునొందినదిచూచి యీయంధ దంపతులు తాము మృతిఁ బొందినారని తోఁచుచున్నది.

మాళవి—అయ్యో! ఇట్టిప్రాప్తి యెవరికైనఁ గలుగునా? పెండ్లియైనది మొదలాముద్దుబిడ్డ సౌఖ్యమున నుండినది నాపాపికన్నులతోఁజూడనుగదా? నారదఋషి చెప్పిన మాట యింకొక్కనాఁడు ముందైనను జ్ఞప్తికివచ్చియుండినఁ గన్నులఁజూడనయినఁ జూచుచుంటిని. అయ్యో! మనము వచ్చునప్పుడు మనకైన మంచిశకునములన్నియు నిందుకేనా?

అశ్వ—అయ్యో! విధిబలవంత మయినపుడెక్కడి శకునములు? ఆవైపున వెదకుదము రమ్ము (అశ్వపతి, మాళవి ముందటికి వత్తురు).
సుమా—మద్రరాజా! మాళవిదేవియా! ఏమాశ్చర్యమిది. మీరెప్పుడు వచ్చితిరి?
ద్యుమ—మద్రరాజు! మాళవీదేవీ! వీరేనా నాసంబంధులు? ఏమాశ్చర్యము వీరిరాక.
అశ్వ—ద్యుమత్సేనరాజునా నేను నిక్కమముగాఁజూచునది? లేక నాకనులేమయినను భ్రమించియున్నవా?

మాళవి—సానందాదేవీ! ఇదేమి యిక్కడనున్నారు మీకన్ను లెట్లువచ్చెను?
సుమా—నవ్వులాటకై వచ్చినవఁట.
అశ్వ—రాజేంద్రా! మీకొడుకుఁ గోడలేరీ?
ద్యుమ—అయ్యో! వారికొఱకు వెదకుచున్నాము. ఈదినము వారిరువురు మూఁడు జాములనుండి కానరాలేమ.
అశ్వ—మాళవీ! ఇంకేటి సందేహము?
మాళవి—అయ్యో! అట్టి యల్లుఁడెట్లు దక్కఁగలఁడు?
ద్యుమ—మద్రరాజా! ఏమిట్లానతిచ్చెదరు. మీకు వారిసంగతి యేమయినను దెలియునా?
అశ్వ—రాజేంద్రా! వివాహమునకుమును పే వివాహమైన సంవత్సరమునకు మీసత్యవంతునికి మృతిగలుగునని నారదఋషి మాతోఁ జెప్పియుండెను.
అందఱు—హా! కుమారా! (అని మూర్ఛిల్లుదురు).

సుమా—మీరు దుఃఖపడకుఁడు. అట్టి దుఃఖము మీకెన్నటికిని రాఁజాలదు. ఈదినమే మీకుఁబోయిన కన్ను లెట్లో వచ్చియున్నవికదా? నాసంగతివినుఁడు. నేనుసాళ్వపురికిఁబోయి ఘటకేతునితో మంచివాఁడనిపించుకొని చెఱలోనున్న మీమంత్రి జయదేవుని విడిపించి యతనినే ఘటకేతునికి మంత్రిగాఁ గావించి, పిదప మిత్రభేదము గల్పించి సైన్యమంతయు స్వాధీనమగునట్లు చేసియున్నాను. రేఁపుదయము మీకందుఁ బట్టాభిషేకము కాఁగలదు. ఇట్టి సంతోషకాలమున మీవియ్యము వారగు మద్రరాజు మాళవీదేవి నిందువచ్చునట్లుతటస్థించెను. ఇట్టిచో నెన్నటికైన దుఃఖము కలుగునా?

[ ప్రవేశము: చిత్రాశ్వుఁడు (ఒకవైపున). ]

అనుబంధము 47.

చిత్రా—కటకటా! నాసావిత్రి పర్ణశాలకు రాలేదే? కన్నులులేని తలిదండ్రు లెందుఁ బోయినారో?

సుమా—అక్కడ నెవరు వచ్చుచున్నారు? చిత్రాశ్వా

చిత్రా—ఆహా! సుమాలీ! ఇదేమిచోద్యము మా మామయు నత్తయు నెట్లువచ్చిరి? మాతలిదండ్రుల కన్ను లెట్లు వచ్చెను?

సుమా—మీయయ్యకుఁ గన్నులువచ్చెను. మీమామ నినుఁజూడవచ్చెను. ఈసుమాలి నీకు రాజ్యముఁదెచ్చెను. అయిన సావిత్రీదేవియేది?

చిత్రా—సావిత్రియేదీ? మీరెఱుఁగరా?

ద్యుమ—చిత్రాశ్వా! నీయొద్దకు వచ్చెదనని వచ్చెనే?

చిత్రా—అకటా! జనకా! అట్లనె నాయొద్దకువచ్చెను. నాకు మహాసంకటముపుట్టి చెప్పరాని బాధలు గలిగె. అతన్వి యంకమునఁ బవ్వళించితిని. భయంకర దుస్వప్నములుగలిగె. దానిఁ దలచుకొన్న నిప్పటికి శరీరమున రోమాంచము లెగయుచున్నవి. ఎవరో భయంకర రూపులువచ్చి నన్నెత్తుకొని పోయినట్లాయెను. సావిత్రి నావెంట వచ్చినట్లాయెను, నిప్పులరేఁచుకొకటికనుపించెను. ననుదేనియందో యుంచినట్లాయెను. సావిత్రిగానరాలేదు. ఇంకను నాకుస్వప్న మో రేమో తెలియఁజాలకున్నాను.

సానంద—అకటా! మాశైవ్యాదేవీ! మీకునారదుఁడు చెప్పియున్నట్లే మాసత్యవంతుఁడు మృతుఁడయి మరల జీవించినాఁడనుటకు సందేహములేదు.

చిత్రా—నారదుఁడేమి చెప్పియున్నాఁడు?

సుమాలి—వివాహమైన సంవత్సరమునకు నీకు మృతిగలుగఁగలదని చెప్పియుండెనఁట. పతివ్రతాతిలకనుగు నీభార్యవలన నీవు మరల జీవవంతుఁడవైనందుకు సందేహము లేదు.

అశ్వ—అయిన మా సావిత్రి యెక్కడనుండును?

చిత్రా—అకటా! నాకిప్పుడు తోఁచుచున్నది. మీకు నారదుఁడు చెప్పినది నిజమాయెనా. ఆనాసావిత్రి తన జీవము నిచ్చి ననుబ్రతుకఁ జేసియున్నది.

అందఱు—ఆహా! ఇదినిశ్చయము.

అనుబంధము 48.

ద్యుమ —సీ. పూర్ణహిమకరాస్య పుష్కరాక్షీమణి లిల
ముదుఁగవిన్న విఱిగిపడియెమాకు

సాన— కువలయాక్షికటాక్ష పావనేక్షణంబొఁ
గువలయస్థితిఁ గమాకువలయునేల
సుమా— కుందరదస్మిత చంద్రికల్ గుందగ
వంతఁ గుందగనుఁ గల్పాంతమయ్యె
అశ్వ— జాతరూపాంగివిజ్ఞాతరూపా లోకన
నివృత్తిలోకము మునిఁగె మాకు
మాళ— తే. గీ పుత్రిశుభగాత్రిగోల్పడిక్షేత్రమెటుధ
రిత్రినిల్చెఁ బ్రాణముపోకఁ జిత్రముగను
చిత్రా— కోరికరియాననను గావహారిపదంబుఁ
జేరెనీరసనసుపులు నీరసములు ॥

ద్యుమ—తరుణీ! సానందా! అట్టి బంగారమువంటి యిల్లునిండిన కోడలుపోయిన వెనుక మనము జీవించి యేమిప్రయోజనము? అగ్నిలో మునుఁగుదము.

సానంద _ అహా! ఇంక యోచింపనేల?

అశ్వ—రాజా! కోడలుపోయిన నీకు మఱియొక కోడలు రాఁగలదు. మాకుఁగ దాతీఱ రాని గర్భశోకము. మాళవీ! పుత్రసంతతిలేక సావిత్రీదేవి నష్టాదశ వత్సరంబులుపాసించి ఆమహాదేవి వరాను భూతిచేఁబడసిన యట్టిసచ్చరిత్రయగుపుత్రి పోయిన పిదప మనకేటి జీవచింత? మనమూచిచ్చునఁ బడుదము.

మాళ__ అహా! ఇంకేటిజీవచింత?

చిత్రా—నిర్భాగ్యుఁడనైన నాకౌసతీరత్న మెట్లుదక్కును? అట్టిసతి ననుఁబాసిచనిన నేను జీవించియుందునా? నేనుఁ దొల్త నగ్నినుఱికెదను.

సుమాలి—అయ్యో! మీరందఱు నట్లయిన పిదప నేనొక్కఁడనా మిగిలియుండుట.

[ప్రవేశము: నారదుఁడు.]

అనుబంధము 49.

నారద—ద్యుమత్సేనరాజా! మద్రరాజా! సానందాదేవీ! మాళవీదేవీ! చిత్రాశ్వా ఊఱడిల్లుఁడు.

సుమాలి__అయ్యా! నేను సుమాలిని—

నార—(నవ్వి) సుమాలి? నిన్నుమఱవను లెమ్ము. మీసావిత్రిఁబోలిన ధన్యులీజగంబుల నెవ్వరుండరు. ఈచిత్రాశ్వునకు వివాహమయిన సంవత్సరమునకు మృతిప్రాప్తియుండెను. ఆసావిత్రి యంచిత పతిభక్తివలనఁ దవపతినిఁ గొనిపోవుచున్న యముని మెప్పించి యతనివలన వరుసగాఁ దనయత్తమామల యంధత్వముదీర్చి రాజ్యమువచ్చుటకును, తనతండ్రికిఁ బుత్రసంతతిగలుగుటకును వరములంపొంది తుదకుఁ దనపతిని సయితము సంపాదించుకొనెను.

అందఱు—నారదా! ఆతల్లి సావిత్రియెక్కడ?

[ప్రవేశము: సావిత్రి, (దూరమున బ్రాహ్మణవేషమున యముఁడు) ]

నారద— ఇదిగో! వచ్చెను.

ద్యుమ } సాన } అహా! సావిత్రిదేవీ! నీవే పరమధన్యవు.

అనుబంధము 50.

ద్యుమ— ఉ. ఈడిఁకసాధ్వినీకునొరులెవ్వరు నీదుచరిత్రవిన్న నే
కీడునుమూడదంగదలొగిఁ దొలఁగుఁ జవరాంధ్రకిద్ధరఁ
సాన— జేడియమిత్తిగెల్చి పెను చెయ్దములారసి చూడనీవుమా
కోడలుగావుతల్లివి తగుందగు సేవలు సేయనీకిలఁ॥

అశ్వ, మాళవి— మాయమ్మా! మమ్ముద్ధరించిన తల్లీ, యిటురమ్మ. నినుఁగనినందుకు మావంశము నేఁడుగదా పావనమాయెను.

అనుబంధము 51.

అశ్వ— ఉ. అమ్మరొమమ్మహీనగతి హైమవతీకరుణాప్తిఁ దేఱ్చదో
సమ్మలువాసెఁదేఱజడిసమ్మద మేర్చెమదిఁ
మాళవి......................................గడాని మేల్
బొమ్మిటురమ్మనిన్ననిన పుణ్యఫలమ్మనెగ్గమాదువం
శమ్మిఁకబాలనిన్ననువిశంకటసోభయశోదయంబిలఁ

అనుబంధము 52.

మత్తకోకిల

సుమా— మాకునైతియొసన్నుతింపగమంగళాంగిరొనిన్ను స
స్తోకమాపతిభక్తిశక్తినిదుస్తరాపదనాఁపితే
శ్రీకరాకృతినంగనాజనశీర్షమండనమైలలిఁ
బ్రాకటప్రభముజ్జగంబులఁగ్రాలునీయశమమ్మరో॥

చిత్రా—నను రక్షించిన నాభాగ్యదైవమా! నేను నిన్నేమని కొనియాడనేరుదు. ఇట్టి చరిత్రగలవారి నెందైన మనము వింటిమే? యమునివాతఁబడిన పెనిమిటిఁ బడయు సామర్థ్య మెవరికిఁగలదు? ఆతివా? నాయానందమునకేది మేర? పూతచరిత్రయగు నిను నాయర్ధాంగిగాఁ బడయుపుణ్యమునకుఁ దొలిజన్మమున నెట్టికఠినములగు దుర్గసీమల ఘోరతపములఁజేసి యుంటినోసుమా?

అనుబంధము 53.

పథ్యృణి—

ఆలఁతకుఁదలక్షకనతిపీఁకయమాయతసాంగణమొందిననన్మరలిం
చలసదసదృశయశమెసంగెనరోజవిలోచన సారసరాగగుణో
జ్జ్వలలలితవిమల పతిభక్తికలాపపరిష్కృతనిస్ఫువినందిననా
తులమెవరికనిలఁదొలిబాములనేదొరలేనితపంబొనరించితొకో॥

సావిత్రీ—నన్ను మీరందఱుంమకింత గొప్పచేసెదరు? నేనెట్టి ఘనకార్య మొనరించి యున్నాను? నాకింకను మీరు బుద్ధిగఱపి ప్రీతిచెయఁదగునుగాని యిట్లు కొనియాడఁ బడుటకు నేనర్హనా? నాథా! నన్నింత నీవు పొగడవలయునా? సంతతము నీచరణధ్యానము మానను. అట్టి నాకు సద్గతి యేలకలుగదు.

అనుబంధము 54.

చ. అరయఁగభూతభవ్య సమయాంచితులీరుగుణప్రశంసన
న్నరమరఁబెద్దఁ జేయదగదంతటికర్జ మదేమొనర్చితిఁ
బరువడిమీపవిత్రపదపద్మముల న్భజియించువాసిమైఁ
బరువిడిపాపముల్దొలఁగిభద్రసుఖంబొఁడగూడ కుండునే॥

నారద—ఇంక మీరేల యూరకాలస్యము చేయుదురు? ద్యుమత్సేనరాజా? మీ రాజ్యము మిమ్ము నెదురుచూచుచున్నది. ఇదిగో! ఈమహామహుఁడు నీకోడలి నిందుఁ బిలుచుకొని వచ్చినవాఁడు బ్రాహ్మణరూపుఁడై మిముధన్యులఁగాఁ జేయ నేతెంచిన పితృపతి. ధర్మరాజు—వందన మొనరింపుఁడు.

[ప్రవేశము: యముఁడు బ్రాహ్మణవేషమున]

(అందఱు వందనముచేయుదురు)

నార— ఉ. సాదరసోదరాశయుఁడహోదరహాసముతోఁగళిందజా
సోదరుఁడుత్తమావిబుధసుందరవేషముఁబూనితాల్మినా
హ్లాదము వెంపనిల్లిదెళుభాగతవంద్యుఁడు దారసిలెనా
రాదృఢభర్తృభక్తిసురరాజ్యమునంకెకుఁదేరెబూసతుల్॥

యమ—అయ్యలారా! మీసావిత్రివలన మీయుభయుల వంశములు పవిత్రములాయెను. సావిత్రిదేవీ! ఇంకఁ బోయివత్తును.

అనుబంధము 55.

సీ. వనితలంగజయాన వాణిఁబల్కవినంగ
జయానవాణిబల్కులకు నేర్తు
రాఖ్యఁబ్రత్యక్షరమావృత్తలాడఁ
బ్రత్యక్షరమావృత్తులాడుచువారు
సర్వమంగళకథాకర్ణలోలురు సర్వమంగళా
కర్ణి కానిటమెనయు
ధురువడిఁబూతి సచ్చరిఁబూనఁగఁగోర్కులు
రువడిపూతఁ జెచ్చెరఁజెలంగుఁ

తే. గీ. జామలకునారసీదుని స్తంద్రలపన
నామనిజకథాశీలగరిమ మెనయద
రమెనులవునాకు వర్ధిలురమణుఁగూడి
రమణసిరియసంబులలరివణ మొసఁగ ॥

చిత్రా—ధర్మరాజా! నీవాత్సల్యత యెంతని కొండాడనేర్తు? మాభాగ్యమునకు సమాన మీధరలో నున్నదా?

సీ. శీలివై వరదయాశాలివై కుజననిర్మాలివై
నతనిగ్రహాళివగుచు
న్యాయివై యిష్టార్థదాయివై యధికనిర్మా
యివై దండవిధాయివగుచు
హారివై సుమనోవిహారివై ధర్మసంచారివై
కలుష సంహారివగుచు
ప్రీతివై రిపుయానుభూతివై యఖిల
నిష్ణాతవై సౌఖ్యసంఘాతవగుచు

తే. గీ. నగణితఖ్యాతిఁజగములఁబొగడుగన్న
నిన్నుఁగన్నారదర్శించి సన్నుతింపఁ
గన్నవారము మాభాగ్యగరిమ నేఁడు
తరమెకొనియాడనో యమధర్మరాజ॥

యమ—నారదా! మనకు వేళకాలేదా?

సుమాలి—ధర్మరాజా! నిన్నొక్కటి వేఁడెదను...

యమ—అదియేమి?

సుమాలి—ధర్మదేవతవై మానవుల కగోచరుఁడవైన నిను నీసౌమ్యమగు బ్రాహ్మణ రూపమున నిటఁదర్శించు భాగ్యము గంటిమి. మాపుణ్యముల కీడులేదు. అయిన మాత్రము నీపునర్దర్శనము నాకులేకుండ ననుగ్రహింప—

చిత్ర—సుమాలీ ! ఇదియేటిమాట (నారద, యమ నిష్క్రమి)

దేవతా తిలకుఁడైన కృతాంతునితో నిట్టిమాటలా—

సుమాలి—నీవుగట్టిపడి వచ్చితివి. తీఱినది. నేను గట్టిచేసికొనఁబనిలేదా?

చిత్రా—ఇంకఁజాలును. పోదమురమ్మ (నిష్క్రమింతురు)



# ఉత్తరరంగము.

ద్విపద:—శ్రీలలితంబు నీచిత్రాశ్వచరిత
మాలకించితిరె పుణ్యాంగనలార
చెలులార పల్లవ శ్రీపాణులార
కలవాణులారయో ఘనవేణులార.
సుమజాలకోమల సురుచిరగాత్రి
సుమవేతపాప సంచయ కాళరాత్రి
పాలితచింతిత ఫలదాగ్నిహోత్రి
శీలక్షమాగుణాంచిత భూతధాత్రి.
రాజితజలజాత రమణీయనేత్ర
రాజవందిత మద్ర రాజసత్పుత్రి
యలఘుచారిత్రయీ యమలసావిత్రి
కులసతీమణులకు గురుభూతగాదె
శ్రీతుంగబహుమహో జితభానుమంతు
శీతలముఖకళాజితనిశాకాంతు
రుచిరరూపజయంతు రుచిచయానంతు
సచలశుద్ధస్వాంతు నాసత్యవంతుఁ
గానలోఁగనినాఁడు కమలాక్షితనదు
ప్రాణనాథునిఁగాఁగ భావించెనంతే
నాసత్యవంతుఁడీ యవనిరాజ్యంబుఁ
బాసియరణ్యంబుఁ బట్టుటవినినఁ
దల్లిగాదనెఁదన తండ్రివద్దనిమె
అల్ల నారదమౌని యాశ్చర్యపడితోఁ
బరిణయంబైన సంవత్సరంబునకు
వరుఁడుమృతుండగు వాఁడంచువినియె

నత్తయు మామయు నంధులైకాన
నత్తఱిమునివృత్తులై యుండుటరసె
గహనమే యిల్లుగాఁ గలుగుటనెఱిఁగె
నహహ తానెంతటి యచలమానసయొ
వెలఁదితామదిలోన వేఱొక్కమనుజుఁ
దలఁబోయదామె నింతటివారుగలరె
మగువయిట్టులదృఢ మానసయగుచు
నగణితగతిఁబెండ్లి యాడెఁ జిత్రాశ్వుఁ
దనమక్కువపుదల్లి దండ్రులకంటె
ఘనముగాఁజూచుచుఁ గడుభక్తిమెఱయ
నత్తమామలకు మహాప్రేమతోడ
నుత్తమ శుశ్రూష లొగిఁజేసివెలసె
నరుదారఁగానలో నాకలంబులనె
పరమామృతముగాఁగ భావించియలరెఁ
దనమగఁడన్నను దైవంబుఁబోలెఁ
గనుగొనిపరిచర్యఁ గావింపఁగనియె
వనజాక్షి తననాథుఁ బాయకయుండి
తనదు పతివ్రతాధర్మంబుపేర్మిఁ
గలిగినమాహాత్మ్యగరిమంబుఁజేసి
యలఘులీలలఁ గాలయమువాతఁబడిన
తననాథుప్రాణముల్ దాఁదెచ్చుకొనియె
ననుపమఖ్యాతి యియ్యవనినిండార
పల్లవాధర యంకపాళిశయించి
వల్లభుఁడుండంగ వానిఁబట్టంగ
సముదీర్ణబహుభీమ సత్వాఢ్యులైన
యమదూతలేతెంచి యటుచేరలేక
దిగులొందివెనుకకుఁ దిరుగుటయెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె

చటులదుస్తర తపశ్శక్తి చేనైనఁ
బటునియమాంచిత భక్తి చేనైనఁ
ఘనతరబహుయోగ గరిమలనైనఁ
గనుఁగొనఁగారాని కాలుండువచ్చి

యగణితరీతిఁ బ్రత్యక్షమాయెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె
ఆరుదారనాథుని ప్రాణముల్ గొంచు
నరిగెడుయమువెంట నంటిదుర్గమము

లైనసీమలఁజేర నలవడుటెల్ల
మానకకాలునిమది కెక్కుటెల్ల
వైతరణీనది వడిదాటుటెల్ల
ఖ్యాతిశ్యామాదేవిఁ గనుఁగొనుటెల్ల

నత్తమామలకన్ను లలరుటయెల్ల
నుత్తమరాజ్యంబు నొగిఁబొందుటెల్ల
దంద్రికిఁబుత్రి సంతతిగల్గుటెల్ల
వేంద్రమావైధవ్య విధితీఱుటెల్ల

దగురీతిశమనుండు దయచేయుటెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె
జలజాతముఖులార యీసావిత్రినలనఁ
దెలుపంగఁబడిన పతివ్రతాధర్మ

విసరంబులెల్లను వింటిరిగాదె
మసలివానిని మీరు మఱవంగరాదు
చిగురాకుబోణియంచితభక్తితోడ
మగఁడెదైవంబుగా మదినెంచవలయు

సతనిబంధులనెల్లఁ బ్రాణబంధువుల
గతినాదరంబునఁ గనుఁగొనవలయు
వేదమంత్రముపోలె విలసిల్లుభక్తిఁ
బైదలిపతిమాట పాటింపవలయు 80

కరుణించివిభుఁడొసంగఁగ నెద్దియైనఁ
బరమామృతముగాఁగ భావింపవలయు
నేవేళఁబ్రాణేశు నీప్సితంబెఱిఁగి
సేవలుభక్తిమైఁ జేయంగవలయు 84

సుదురాజముఖినాథుఁ డొద్దలేకున్నఁ
గడునలంకారముల్ గయిసేయరాదు
కులటలతోఁజెల్మిఁ గూడంగరాదు
చెలువుని హాస్యంబు సేయంగరాదు 88

ఏపారఁగానెందు నెదురాడరాదు
కోపించెనని మదిఁ గుందఁగారాదు
సమ్మతింపనిపనుల్ సలుపఁగారాదు
సొమ్ములివ్వఁడటంచు సోలయఁగారాదు 92

గుఱుతుగా నీధర్మ కుశలతగల్గు
తెఱవ వ్రతాతిలకంబుగాదె 96

పతిభక్తియొక్కటి బలముగాఁగల్గు
సతికినెందైన నసాధ్యంబుగలదె
యింతికిఁబతిభక్తి యిష్టదాయకము
కాంతకుఁబతిభక్తి కలుషశోషణము 100

భామకుఁబతిభక్తి బహుజన్మఫలము
రామకుఁ తిభక్తి రత్నభూషణము
కలికికిఁబతి క్తి కామితదాయి
వెలఁదికిఁబతిభక్తి వెలలేనిసొమ్ము
మెలఁతకుఁబతిభక్తి మేల్మిదానంబు
నెలఁతకుఁబతిభక్తి నిక్కంపుమాట
పతిభక్తిరమణికిఁ బాపనాశనము
పతిభక్తితరుణికి ఫలదాయకంబు
పతిభక్తి యువతికిఁ బరమభద్రంబు
పతిభక్తి పొలఁతికిఁ బారిజాతంబు
పతిభక్తి చామకు బహుసౌఖ్యకరము
పతిభక్తి లేమకు వరముక్తిదంబు
పతిభక్తి చెలువకు భాగ్యసంతతము
పతిభక్తియతివకుఁ బటుయశోంచితము
వటియింపఁగానుప వాసంబులేల
యటమటింపఁగఁదీర్ఘ యాత్రాదులేల
రహిఁగాశియేల యారాకాసియేల
బహుళయజ్ఞములేల వ్రతములవేల
ధ్యానంబులేల బలిదానంబులేల
స్నానంబులేల ప్రస్థానంబులేల
బాలామణికిఁబతి భక్తి యొక్కటియె
చాలదే పరికింప జన్మఫలంబు
సరిలేనియిహపర సౌఖ్యంబులెల్లఁ
బరఁగింపఁ జాలెడు పతిభక్తి యుండ

నితరవ్రతాదుల నెల్లను మోక్ష
మతివలఁ బొందంగ నడరుటలెల్ల
రిత్తపోవఁగనల్ల రేఁగుబండులకు
ముత్తియంబులుపోయు మూర్ఖతగాదె 128

యలమేరుపర్వతం బమరంగ నెక్కి
గులకరాళ్ళేరంగఁ గోరుటగాదె
నవనీతమంచితో న్నతిఁజేతఁగలిగి
యవనినేఁతికినంగ లార్చుటగాదె 132

కావున సతులార కల్యాణులార
యావిలమతిమాని హర్షంబుఁబూని
భావంబులను బతిభక్తినిండారఁ
బావనలై యుండవలయునుసుండి 135



# అనుబంధములు

అనుబంధము

1 సూత్ర—రాగము పూర్వికల్యాణి రూపకతాళము.

దేవవిసరగోలా-(శౌరి)-(హరి) ॥దేవవిసర॥
వసజనయనలోక పాల ॥దేవ॥
సేవాతిగ భానాంచిత-పావనమానీంద్రవినుత ॥దేవ॥
సుజనావన-ఘనమానస-సుగుణాంచిత వాసుదేవ-
త్రిజగన్నుత పురుషోత్తమ-దేవవైరిదమనా
అజసన్నుత కమలావర-యంచితఖగవాహన
రజతాచలవాసవంద్య రామకృష్ణసుకవివినుత. ॥దేవ॥

2 నటి—రాగము-దర్బారు రూపకతాళము.

ఇంపుచూపెఁగా-మిగుల-నింపుచూపెఁగా
ఇంపుచూపియానంద-మిచ్చెనిందు హేమంత ॥మింపు॥
ఉత్తరంపుగాలివిసరె-నుహుహూయనిలోకమెల్ల
తత్తరించిదినముమిగులఁ-దఱుగసాగెను.
అత్తమిల్లియెల్లకడల-నాంద్రుమగలఁ గౌగిలించి
చిత్తజాతకేళిఁదేలి-చెలఁగివిడువఁజాలరైరి ॥ఇంపు॥ ౧
చేమంతులు పూయఁదొడఁగె-చెంగలువలుమిగులవెలసె
తామసించిరాత్రులెల్లఁ-దనరెపొడవుగై
వేమరుసూర్యాగ్నులందు వేడిగుణముపారిపోయి
భామాకుచసీమలందు-భద్రముగనుదాగియుండ ॥నింపు॥ ౨

౩ ఉభయులు—రాగము- బ్యాగు ఏకతాళము.

ధీరతనము మెఱయఁగా-సారబలము వెలయఁగా
వైరివరుల-నరులబరుల-హరులకరుల-హతము చేతుము ౧

ద్యుమ—తుండ్లుగాగ నఱుక నే-
ఘట— పండ్లువెడలఁ బెఱుక నే-
ద్యుమ—కండ్లుగానని పౌఱుష మేటికి
ఘట— విండ్లువిడిచి పారరేకాటికి ॥ధీర॥ ౨
ద్యుమ—పోరఁగలవె
ఘట— నిలువరా
ద్యుమ—బీరమేల
ఘట— తొలఁగరా
ద్యుమ—ఘోరశరుఁడ
ఘట— ధీరవరుడ
ద్యుమ—కుటిలగతివి
ఘట— కూహకమతివి ॥ధీర॥ ౩
ద్యుమ—ఔరా-గర్వము-నీకెంత
ఘట— రారా-చూతము-నీవెంత
ద్యుమ—ధీరుఁడనే
ఘట— వీరుఁడనే
ద్యుమ—బీరములాడకు
ఘట— పోరాపో ॥ధీర॥
ద్యుమ—భండనమేటికి నీకిందు
ఘట— దండముపెట్టవె నాముందు
ద్యుమ—చెండెదరా
ఘట— గండమురా
ద్యుమ—కొండకుఁదగరా
ఘట— కూయకురా ॥ధీర॥ ౪

4 రాగము-కళ్యాణి రూపకతాళము.

సావి— పరికింపుమీవన-మరుదుగనలరారె
పరమానందమునించెఁ-దరుపాళులు ॥పల్లవి॥
ఉత్ప— జలజాక్షిసురసాల-ఫలభూజములవీనిఁ
దిలకింపుమివియెందుఁ-దులలేనివి ॥అను॥
సావి— నాతిరోచూచితె-చేతోముదమునించె
ప్రీతిగనీపారి-జాతములు ॥పరి॥ ౧
ఉత్ప— పోలఁగఁగ్రాలెడు-లీలాలోలములౌఁచు
నీలతమాలను-సాలములు

5 సావిత్రి— రాగము-నాథనామక్రియ ఆదితాళము.

సుందరుఁడీధీరుఁడు-ఓసఖియ॥ సుంద ॥పల్లవి॥
అందములోచనా-నందముగావించె ॥అను॥
నానాసుందరులను-నేనెందుజూడనో
సూనాళిబాణసమానుఁడీఘనుఁడు ॥సుంద॥
ఎంతనియీసొగ-సెంతునేరజనీ
కాంతుఁడోజయంతుఁడో వసంతుఁడోయాకంతుఁడో ౧

6 చిత్రా— రాగము-కళ్యాణి ఆదితాళము.

దూరమున్నదింకఁజేరగఁబోవలెసాళ్వపురి
గారవించిమిత్రా-వారువమదలింపుము వేగ ౧
సాగరంబుఁజేర-నేగెడునింతెనెభాస్కరుఁడు
వేగవేగరమ్మాయీగతివెనుబడుటిదితగునే ౨
సుమ— రాను-రానురాను-నేనొక్కడనుగా నను ముందు
ప్రాణమేపోదయ్యో-ధీనీసహావాసముచాలు

7 చిత్రా—రాగము-నీలాంబరి ఆదితాళము.

అరుదైన యీమిటారి-మరుచేకటారి ||పల్లవి||
ఎంచిచూడనాగవేణి-యంచదబ్జపాణి
మించుమించుబోణి-పంచబాణురాణి
అందమెల్లనించెమేన-నిందుమందయాన
ఎందునైనఁగాన-స్త్రీ-సుందరీసమాన ||అరు||

8 సావిత్రి—రాగము-సురటి ఆదితాళము.

ఆహా విపులదుఃఖము మీఱెనే-నయ్యో
యింకెటు తాళుదునో
ఊహింపగాననురక్షించినట్టియా
మోహనరూపునిఁజూడఁగా ||పల్ల||
ఈభవ్యరూపములీల-శోభాయమానముగాగా
స్వాభావికంబవ్వైనయ్యారెయాబాళి
నాభాగ్యమెట్లున్నదో
విరాళిదీఱఁగఁబతని-వరాశ్లేషగతిలేక
కరాళకరముక్రూరునిమారుని
శరాసారమెటుతాళుదు. ౧

9 రాగము-జంజూటి రూపకతాళము.

సావి— ధన్యనైతిఁజాలుభళీ-ధారుణీరమణ
మాన్యతనా-పైసనీకు-మనసు-గల్గెనా ||ధన్య|| ౧
చిత్రా—మానుముసంతోషమిఁక-మానినీమణి
దీనుఁడనై నానుసమా-ధానము నెఱుఁగ ౨
సావి— ఏటికినీదీనములో-మాటలురమణా
పాటిగనీమదిఁగల-భంగిదెలుపుమా ||ధన్య|| ౩

చిత్రా— కామినినామానసమూ-కంపముఁజెంద
ఏమని చెప్పుదునో-భామామణిరో ౪
సావి— ఇంతమహాసంతాపము-దేటికిఁగలిగె
అంతయు నెఱిఁ-గింపగదే-చింతలుమాని ౫
చిత్రా— వలదునీ-నెమ్మదికి-బలమగుచింత
లలనామణి-శ్రీహరియే-కలవాఁడింక ౬

10 చిత్రా— రాగము-జంజూటి ఆదితాళము.

చాలునే-ఇక-చాలునే-బాసలు
సారసాక్షి-చాలునే ॥పల్లవి॥
బలముగ-నెనరింత-యున్న నాకు ॥చాలునె॥ ౧
మనసున-గలుగదు-సంశయము ॥చాలునె॥ ౨
ఘనమతి-వనజాక్షి-మెచ్చినాఁడ ॥చాలునె॥ ౩

11 సావిత్రి— రాగము-బేహాగ్ రూపకతాళము.

తాళఁగలనా బాళియింతైన-భూపాలమౌళీ
మేలిలీలల బాళిదేలఁగ-చాలదయచేనేలవే ॥పల్లవి॥
ప్రాణనాయక నన్నునీవిటు1మానిచనఁబెనువంత చే
దీననైనా ప్రాణతతి నే-నూనియుండెదు దాననే. ॥తాళ॥ ౧
భూరిభుజసుకుమార-తమిచెన్నారనినువరియింపక
మారుశరములబారికోర్వఁగ దీరయంతటిధీరనే ॥తాళ॥ ౨

12 చిత్రా— రాగము-తోడి ఆటతాళము.

పోయివచ్చెదమందగామిని-నాకు
పాలుపార-సెలవిమ్మి-భామినీ ॥పల్లవి॥
ఎన్నవలదుకిస్క-నన్ను మఱువకింక

నిన్ను మఱువఁజాలగామినీ ॥పోయి॥ ౧
ఇభయానననాకిందు-నభయ మొసఁగిముందు
శుభముగననుఁ-బోయిరమ్మనవే ॥పోయి॥ ౨
ఖిన్నతనరిగాదె-చెన్నుదఱఁగునీదు
కన్నుఁగవలనీరునింపకే ॥పోయి॥ ౩

13 సుమాలి—రాగము-కేదారగౌళ ఆదితాళము.

ఎందులేని-చందముగా ఔరౌరా-పెద్దపులి
చెలువలగల పెద్దపులి-నీలముతల పెద్దపులి-భల-భల-భల
పెద్దపులి-ఆహాహాహాహా ॥పల్లవి॥
కాంచఁగాంచమించుఁగదా. ॥ఔరౌరా॥ పెద్దపులి
ఎంతవానిలోఁజేయుఁగా ॥ఔరౌరా॥ పెద్దపులి

14 ఉత్పల—రాగము-నారాయణగౌళ-కేదారగౌళ మిశ్రరూపకతాళము.

సుందరాంగి-సావిత్రీనీ-వెందుబోయితమ్మ నేఁడు ॥పల్లవి॥
డెందమున-కరుణలేక-మందయాన-నన్ను మాని
మందభాగ్య-రాలనైతి-నెందుబోయి ॥సుంద॥ ౧
కానలోన-పెదకివెదకి-కాననైతినమ్మనిను
మానవతి-శార్దూలము-మానకనిట్టి దినెనేము-
హీనబుద్ధి మానిపోతి ప్రాణమైన-బాయదయ్యె ॥సుంద॥

15 ద్యుమ—రాగము-ధన్యాసి రూపకతాళము.

ఓల్లను-నొల్లను-జీవ-మెల్లసంకటములకిల్లయ్యె
హారిహారి ॥ఓల్లను॥ ॥పల్లవి॥
ఎక్కడజీవన-మీవిధిగలిగెన-
అక్కటక్కట శ్రీహరి ॥ఓల్లను॥ ౧
ఇట్టిదుశ్చరితము-నెందైనవింటిమె
కట్టాదుఃఖముమీఱెగా. ॥ఓల్లను॥ ౨

16 పానంద—రాగము మధ్యమావతి రూపక తాళము.

హరిహరీయెంత-యన్యాయమాయెనయ్యో. ||పల్లవి||
ఈపాపమెందైన-నేపారఁగంటిమె
ఆపదబాపిమముఁగాపాడువారెవరు ||హరి|| ౧
చేరితొలిజన్మమున- జేసినదురితము
ఈరీతిగమమ్ము-నేలబాధింపదు ||హరి|| ౨

17 చిత్రా రాగము-నాథనామక్రియ ఆదితాళము.

ఎంతదుర్గినమో-సంతాపఘనమో
ఎంతని నేమదిఁజింత సేయుదు ||హరి|| ||పల్లవి||
వెల్లుతాపమున-నుల్ల ముపగిలె-
కల్లరిదైవమా-తల్లిదండ్రులఁజూడ. ||ఎంత|| ౧
ఆజివైరులను-రాజులుగెలువరే
ఈజగముననీ-యోజకలుగునే. ||ఎంత|| ౨

18 ఆశ్వ—రాగము బ్యాగు ఆదితాళము.

కాంతాయీచింత యనంతముగాదే-నా-
స్వాంతముపంతాప మెంతనితాళుదు ||పల్లవి||
కాలానుకూలము చాలదుకాదే
యీలాగుమమ్మింతఁదూలింపనౌనె ||కాంత|| ౧
ఈదారిమోదము పోఁదోలి చాల
వాదములాడఁగఁగాదనలేము. ||కాంత|| ౨

19 నారద—శ్రీరాగము-ఆదితాళము.

హరినారాయణ మాధవశౌరే-
సురనాథాదర చక్రిమురారే. ||హరి|| ||పల్లవి||
వనమాలాధర వరమవానీయా-
ఘనకంధరసమకాయమురారే ||పల్లవి|| ||హరి|| ౧

అమరార్థాధృత బహువిధవేషా
సుమతల్పాయిత శేషమురారే ॥హరి॥ ౨
గరుడాంచితబహు రమ్యతురంగా
పరిపాలితసారంగమురారే ॥హరి॥ ౩

20 మ్యమ—రాగము బ్యాగ్-ఆదితాళము.

సుదినముకాదెచాల-భళీయిది-సుదినముకాదెచాల. పల్లవి॥
కడుకొనిమనమీ-యడవులలోఁపలఁబడినబాధలన్ని బాసెశెబాసిది
సా. వ్యర్థముగాకీపాపుజన్మము-సార్థకమాయెనుచాలభళియిది॥సుది॥
ద్యు. ఎనసినమనదగు-ననదగలికినీ-ఘన వేణీమణిగంటిమహాయిది ॥సుది॥

21 చిత్ర—రాగము బ్యాగ్-ఆదితాళము.

దైవమునకెంత వైరమో-నాపై ॥దై॥ ॥పల్లవి॥
అనుదినమునునీ-ఘనమగుదుఃఖ
మెనసినా-మనసున-మానదాయె ॥దై॥ ॥పల్లవి॥
నిరతమునామది శరహతిఁబోలె
కరకర-దొరయఁగా-గాయమాయె ॥దై॥ ౨
అవనిలో-నాపూర్వ-భవమున నేను
దవిలియే-యఘముల-జేసినానో ॥దై॥ ౨

22 బ్రాహ్మ—రాగము-నాధనామక్రియ ఆటతాళము.

చాలబాధలొందినాను-శంకరశూలీ-హా
చాలునన్నుఁగాపుమింక-శంకరశూలీ
బైటఁజేరు-దారినిబల్-కానలోనేఁగానను-
చాలునన్నుఁగాపుమింక-శంకరశూలీ ౧
రాతిరెల్ల కానలోనా శంకరశూలీ
భీతిఁజెందినానుచాల-శంకరశూలీ ౨
భోజనముదారినిబల్-కానలోనేఁగానను
చాలునన్నుఁగాపుమింక-శంకరశూలీ ౩

అందలం—రాగము-ఇంగ్లీషునోటు.

కమలావర సమరాసుర-దమనాజయమంగళం
సుమనోవర విమలాదర-కమనీయామంగళం ||పల్లవి||
హీరోపల-హారోజ్వల-ధీరాజయమంగళం
భూరిధరా,ధారసురాఁధీరాశుభమంగళం ||కను|| ౧
నీలమణీ-జాలఘృణీ శ్రీలాశుభమంగళం
వేళాంచిత-శీలాయుత-లీలాజయమంగళం ౨
మిహిరాంచిత-మహిమోన్నత-బహుతేజామంగళం
కుహనాజన-గహనార్జున-దహనాశుభమంగళం ౩

సావిత్రి—రాగము-కదంబరి ఆదితాళము.

ఈతాపమున-కేమిసేయుదు. ||పల్లవి||
కాంతుఁడునన్నిటు-లింతటఁబాయునే
ఎంతనితాళుదు-నేమిసేయుదు ||ఈతా|| ౧
దామాదిదైవము-మాయలుచేయదే
పాయఁగఁజేసిన-నేమిసేయుదు ||ఈతా|| ౨
పావనులెవ్వరుఁగావగఁజాలరే
జీవమిఁకేటికి-నేమిసేయుదు ||ఈతా|| ౩

దూతలు—రాగము-గరుడధ్వని ఏకతాళము.

వెడలుడింకఘోరత వెలయునాకారత
యడరభూరిస్వారత యలఘుధీరత ||పల్లవి||
నరకములను వేయమె కరఁగగారాయమె
దురితనరులకాయమె దూలఁజేయమె ౧
అకరదెయజస్రము నంధతమిస్రము
కడఁగిఁపారనస్రము ఘుస్రఘుస్రము
చిత్రా—దూతలారనిరతము దోచమీాచరితము
ఖ్యాతిమోదభరితము గనుఁడిత్వరితము ౨

యమ—రాత్రియెల్లతావుల రారెయాజీవుల
చిత్రగుప్తయీావల నిలుపుక్రేవల
దూ॥చి—దండపాశసంయుతా ధతవైవస్వతా
దండమఖిలభూనుతా ధర్మసమ్మతా

26 నారదుఁడు—రాగము-సురటి రూపకతాళము.

వాసుదేవా నారాయణ దామోదరా హరే ॥పల్లవి॥
మహనీయనగర సదాకృతవాసా
శ్రీకాంతానంతవిలాసాహరిహరి ॥శ్రీవాసు॥
మునిజనానందదాయక శుభాకారా
వనమాలాంచితహారా హరిహరిహారా ॥వాసు॥ ౨
కలుషసంహారక గరుడశతాంగా
జలధరనీలశుభాంగా హరిహరి జలదశుభాంగావాసు ౩

27 యమ—రాగము-కమాజు రూపకతాళము.

నారదసంయమీా యీారీతిన్యాయమే
జగతిజనులసర్వపాప చయముులెక్కచేసి
తగినరీతిదండనంబు దగులఁజేయమి ౧
భాసురముగనిత్యధర్మ శాసనంబులమాని
వానికరుణఁజూపనమ్మ దోసమొందదె ౨

28 నారదుఁడు—రాగము-పీలు ఆదితాళము.

వాణీనాయక వైభవదాయక
వరగత్సృష్టివిధాయకా ॥వాణీ॥ ॥పల్లవి॥
తుంగవిలాసా మంగళవేషా
సంగతసజ్జనపోషణా ॥వాణీ॥ ౧

శ్రీమహనీయా ప్రేమామేయా
కామితఫలసంధాయకా ॥వాణీ॥ ౨
పాపవిభంగా తాపసనంగా
దీపితహంసతురంగమా ॥వాణీ॥

29 కరుణ—రాగము-నాథనామక్రియ ఆదితాళము.

సరోరుహాసన విధాత నేనిను సన్నుతించి మ్రొక్కెదను ॥పల్లవి॥
నన్ను సృజింపఁగాఁ గారణమదేమొ
నాకునానతియివ్వ చెన్నుమీఱవిన్నవింతు ౧
ఘనముగనిన్ను నేఁ గొనియాడఁగలనా
ననుపనిఁబంపుమిఁకేలా
మనమున నెనరుంచి ॥సరోరు॥

30 కరుణ—రాగము-సురటి రూపకతాళము.

శారదమనోజ్ఞ భృంగవారిజాసనా
దేవపాలవందన శ్రీవరానందన పావనమమా
నీంద్రవంద్య పాదపంకజా ॥శారదా॥ ౧
లోకవినుతికెక్కెద నీకిదె మ్రొక్కెద
నాకునింక యానతిమ్ము లోకనాయకా ॥శారదా॥ ౨

31 చిత్రా—రాగము-సురటి రూపకతాళము.

అహాయేమీయాశ్చర్యము ఊహాతీతము శ్రీహరిహరి॥
మానకమ్మాడుదినంబులనుండియుఁదానుపవాసముఁ జేసి
ఈనాడైననుఁబారణ సేయదు మానినీమణి ॥శ్రీహరిహరి॥ ౧
నేఁడేటికోమదిఁ గళవళమందెడుఁ గీడుజనించెడుభీతి
జూడ౦-జూడఁగాలోకమంతయుఁ-
బాడైనటుదోఁచె ॥శ్రీహరిహరీ॥ ౨

భాసిల్లెడునీదినమణియెంతయు-మాసినవై ఖరిఁదోఁచెఁ
గాసంతైననుసత్తువగలుగదు-మోసమిదేమొ. ॥శ్రీహరి॥ ౨

32 చిత్రా—రాగము-కమాజు రూపకతాళము.

భామాయిటులేలయిఁక-బామాయిటులేలయకటా!
ఓతరుణీ-ఓకలికి-ఓరమణీ ॥భా॥ ॥పల్లవి॥
ఇంచుకమదిదాళుకొనకసంచలించెదే-ఈగతి
సంచలించెదే-తరుణీ-ఎంచవుమా
నాంచలమా-చంచలమా ॥భామ॥ ౧
దీనగతినిబొందఁదగునే మానినీమణి-ఈగతిమానినీమణి
తరుణీ-లోనవగ-మానవుగా-కానవుగా ॥భా॥ ౨
ముదితనీకునేటికింత-విదితభీతియు-నింతటి-విదితభీతియు
తరుణీ ఇదితగవా-మదినగవా-ఓమగువా ॥భా॥ ౩

33 సావిత్రి—రాగము-తోడి రూపకతాళము.

తాపమునేతాళఁజాల-రూపుమాపగా హాహా ॥పల్లవి॥
ఏరుపొందరిట్టిగతి-ఘోరదుఃఖమాయెనింక-
మీరఁజాల-నేమిసేతు-భూరిశోకమడరెనయ్యో ॥తా॥ ౧
సన్నుతించివేఁడికొందు-నిన్నునిందుధర్మరాజా
ఖిన్ననైతిఁదాళఁజాల-నన్నుఁగాపుమింకహాహా ౨

34 యముఁడు—రాగము-కాంభోజి అటతాళము.

బాలయిట్టిరీతి-యేలగలైనీకు-
నీలవేణిముందు-బోలదింక రాఁగ ॥పల్లవి॥
ఇట్టిశోకమున-నేమిఫలమయ్యె
పట్టికాలగతి-యెట్లుతప్పునింక ॥బాల॥ ౧

ఎంతదూరమనుచు-నీవువచ్చుదాన
వింకనీదుబుద్ధి-నెంచిపోవుమింక ౨

35 సావిత్రి—రాగము-నీలాంబరి రూపకతాళము.

కరుణాలవాల-వరధర్మపాల
విరహాంబుచాల-భరియింపఁజాల ॥పల్లవి॥
ఉపకారమైన-విపరీతమైన
తపియించుదానఁ-గృపమానవోనా. ॥కరుణ॥ ౧

36 సావిత్రి—రాగము-నాథనామక్రియ ఆదితాళము.

చింతబాపనీకు-నింతభారమా ॥పల్లవి॥
మానవిదయచే-దీనులఁబ్రోచుట
భూనుతధర్మముకాదా-ఓశమన ॥చింత॥ ౧
ధరణిసి వెలుఁగని-ధర్మములున్నవె
అరసికరుణఁగావవే-ఓశమన ॥చింత॥ ౨
అక్కరతోనా-మ్రొక్కులుగైకొని
చక్కనిదయఁజూడవె-ఓశమన ॥చింత॥ ౩

37 యముఁడు—రాగము-నాథనామక్రియ ఆదితాళము.

ఆనందమాయెను-కలవాణి
ఘనవేణి-కల్యాణి ॥ఆనంద॥ ॥పల్లవి॥
వన్నెయువాసియు-సన్నుతికెక్కెను
ఉన్నతితోనే-నిన్నుమెచ్చితి- నానంద ౧
కామినినీవచ-నామృతధారలు-
నామదికెక్కెను-భామమిగుల నానంద ౨

38 సావిత్రి—రాగము-హిందూస్తాని భైరవి రూపకతాళము.

పాపముగాదా-నా-పాపముగాదా
తాపముదీర్చియాపదలనుబాపఁగదారా ॥పాప॥ ॥పల్లవి॥

వేమరునా-కేలుమొగిచి-వేడుచుండఁగా-
కామినిబల్ దీనయనుచు-కరుణయేలేదా ||నాపాప|| ౧
వేడివేడిఁ గన్నీరు-వెడలుచుండఁగా-
వేఁడుచున్ననన్ను దయఁ-జూడఁగరాదా ||నాపాప| ౨

39 యముఁడు—రాగము-బ్యాగు ఆదితాళము.

భామినిమహానందమాయెనీ-పాతివ్రత్యమెంచగా ||పల్లవి||
ఆహానిన్నుజూడ-నాశ్చర్యమాయెను
ఊహాకుమీరె-నీ-మహాత్మ్యమియ్యెడ ||భామిని|
ఈనీదుశక్తికి-నానందమొందితి
మానసముననో-మానవతీమణి ||భామినీ|| ౧

40 సావిత్రి—రాగము-గౌళ రూపకతాళము.

ధన్యనైతిని-చాలుభళిరే-యమధర్మరాజా ||పల్లవి||
అయుతభానుని-ప్రాయవిలాసుని
ప్రేమనుగన్న-మూయఁడాయె-నన్ను-బాయడాఁయె
నేఁడుమాయమాయె-అట్టి-నాయకుదయనిచ్చితె ||ధన్య|| ౧
ఉన్నతిఁజెంపుచు-నన్నుతియింపుచు
నితమతిచేనన్నుమాని-చన్న వన్నెకాని
దయ-నెన్నఁబూనియిచ్చి-నన్నిందురక్షించితే. ||ధర్మ|| ౨

41 యముఁడు—రాగము-బేగడ ఆదితాళము.

తరుణికంటివే-గురుతరంబుగాను-
పరమఘోరమిందు-నరకసంచయము ||పల్లవి||
కాలసూత్రమిది-ఘాతకంబుచేయు
దేలియున్నవాఁడు-గూల్లనిందులోన ||తరుణి|| ౧
చిత్రరీతినసి-పత్రమంద్రుదీని-పుత్రినమ్మువాఁడు

పొరలి దూలునిందు ||తరుణి|| ౨
రౌరవంబుదీన-ఘోరజింతుహింస
కోరి చేయువారు-చేరిపోలువారు ||తరుణి|| ౩

42 శ్యామదేవి—రాగము-కమాజు రూపకతాళము.
కలుగు నెసంతోషమింత ||ఆహా|| ||పల్లవి||
ఇలమీదనినువంటికులకాంతగంటిమె
లలనానీవాడిన-యలఘుమము లెల్ల
తలపోయనాశ్చర్యమాయె. ||కలుగు|| ౧
సావిత్రిని న్నెందు-సేవించినజన్మ
పావనమయ్యెడుఁగాదె. ||ఆహా ౨

43 చిత్రా—రాగము-హిందూస్తాని కాపీ రూపతాళము.
మానినీమణియెందుజనెనో-కాననసీమ
మానవతినేఁబాయఁజేసి తె-హీనదైవమా ||పల్లవి||
వనజలోచనబాలామణి-వారణయానా-
వనితయిఁకనాజీవమేటికి-బాపినిగానా- ||మాని|| ౧
అక్కటకట యెందుబోయి తె-హాయలివేణి-
చిక్కియడవిలోన నెందు-చేరితో రాణి ||మాని|| ౨

44 ద్యుమ—సానంద రాగము-తాళము.
ఎన్నఁడింకఁజూతు మో-నిన్ను తనయాహా-హా
మామీదనీకునీ-తామసమేటికి
ప్రేమ-లేమిచెల్లునే-హా-హా ౧
తెగవిడనాడిపో-వగనానెకోడలా
వగ-పొగలించెగా-హా-హా ||ఎన్న|| ౨

45 సుమాలి—రాగము-తాళము.
తెలియనిమాయ-వెలసెనుగా ||పల్లవి||
అంధులై కానన-మందున్నవారు

ఇందునలేరు-ఎందున్నవారో ॥తెలి॥ ౧
ఈపర్ణశాలలో-వేపారనున్న
భూపాలుఁడింత-లోపలలేడే. ॥తెలి॥ ౨

46 అశ్వ—మాళవి—రాగము-తాళము.

పాపమింతకలుగునే-పాపమింతకద్గె
తాపములకునింకఁ-దాళఁగజాలము ॥పల్లవి॥
అల్లుఁడుపుత్రియుఁ-జల్లగామమ్మును.
నుల్లసిల్లజేయుట-కల్లలేమాయె ॥పాప॥

47 చిత్రా—రాగము-నాథనామక్రియ అటతాళము.

అకటాతరుణీ-ఇఁక నెందునినుఁజూతు
ఒకనాఁడునినుఁబాయ-సుకుమారిఘనవేణి ॥పల్లవి॥
సముదారహిమకర-విమలవదనకాంత
రమణీ-కమనీ-యమణీ-సుమపాణి ॥అకటా॥ ౧
కలికినిన్నెడబాసి-బలుచింతనేఁదాళ
గలనా-లలనా-కలనైన-నెలనాగ ॥అకటా॥ ౨
చెలినినుబాఁసిన-బలుప్రాణములునాకుఁ
గలవే-చెలువే-యలివేణి-కలవాణి ॥అకటా॥ ౩

48 అందరు—రాగము-తాళము.

అయ్యోయీశోకము-తాళుదుమే. ॥అయ్యయ్యో॥ ॥పల్లవి॥
ద్యుమ—రాకేందువదనా-చేకోనినీవింక
రాకున్నమాగతి-యేమోగదా ౧
సౌన—ఈడేరవిన్నొక్క-నాఁడుచూడఁగలేదు
కోడలా!మాభాగ్యమింతెగదా ॥అయ్యో॥

సుమా — భూవలయమున-నీవిధికలుగునె-
దైవమునమ్మింత-తారించునే ॥అయ్యో॥
అశ్వ— హా-పుత్రినీముద్దు-రూపుచూడకయుండ-
పాపిదైవమునమ్మువంచించెనె. ॥అయ్యో॥
మాళ— పుత్రినివిమలచా-రిత్రఁజూడకయుండి
చిత్రముప్రాణముపోవదుగా. ॥అయ్యో॥
చిత్రా — కాననముననన్ను-మానిపోవఁగనౌనె
హానారీస్వవింత-తలపోయుమా

49 నారద — రాగము-తాళము.

గోవిందదామోదరా॥నారాయణ॥వనజాక్ష॥గో॥ ॥పల్లవి॥
వేదవినోదన-సాధుప్రసాదన-మాధవ
మధుసూదనా॥నారా॥వన॥గో॥ ౧
శ్రీమానాయక-కామితదాయక
ప్రేమానుసంధాయకా॥నారాయణ॥వన॥గో॥ ౨

50 రాగము బిలాహరి రూపకతాళము.

అశ్వ— బాలరాగదవే నీలవేణిరో వెలయంగరాదె
లీలాయతము నీలాగునమెలామెఁజాలును ॥పల్లవి॥
సుమా— ముందునెన్నఁడు నెందుఁగానని చందమెంతయునిందుజేసెను
సుందరినిను సందర్శించిన నెందదుపాపము ॥బాల॥
ద్యుమ— దీనులన్నము పూనికావఁగ గానవచ్చితెమానినీమణి
చానామదికి నానాగతుల నానందమాయెను ॥బాల॥
సాన— కోడలానిను జూడకుండిన నెడుకాయమువీడుచుంటిమి
చూడఁగతిగ పోడానీకొక రీడాలోకమున ॥బాల॥
చిత్రా — కామినీను బామగాఁగొనుటేమిభాగ్యపునోముఫలమొ
ఏమానితపు ప్రేమాయతియొనామానినీమణి ॥బాల॥

నార— సారసాక్షిరొప్పిరెనీదగు వారుచూచితెయారజెందము
కోరిముదము నారీమణిరొ పీరినిగలసి ॥బాలి॥
యమ—పావనాంచితధీవిచారను భావయూరికిఁబోవనెంచితి
నేవెడెదను వెవెగనెలవీవె మానవతి ॥బాల॥

51 అశ్వా—మాల—రాగము-బ్యాగ్ రూపకతాళము.

బలువింతగాదె యిట్టిలీలయెందువింటిమె పల్లవి॥
లీలయెందువింటిమె యీలీలయెందువింటిమె ॥పల్లవి॥
చాలసంతంబుమా కీలలవెలయించునె
ఈలలవెలయించునే ఈకాలుఁడుగరుణించునె ॥బలు॥ ౧
సంతసంబుబూనగా వింతలుగలిగించునె
వింతలుగలిగించునె ఈయంతకుడరుదెందునె ॥బలు॥ ౨

52 సుమాత— రాగము-బ్యాగ్ ఆదితాళము.

మాకునలవియె నినుగొనియాడఁగా
లోకమునఁ లెందులేని పీఁకజేసితివి
ఈకరుణిసతులమే మెందునైననఁగంటిమె ॥మాకు॥
అతివమమ్మందరిని నతిశయముగను
బ్రతికించినదినీ పతిభక్తియేకదా ॥మాకు॥ ౧
త్రిజగంబులనునీ స్థిరయశమలరె
భజనసేయుదుమునిజముఁదల్లిరో ॥మాకు॥ ౨

53 చిత్రా—రాగము-సురటి ఆదితాళము.

ఏమిపుణ్యముఁజేసినానో నీవంటిసతిభార్యగాఁగ ॥పల్లవి॥
(మానినిరో మానవతి కామినిరో)
సన్నుతిమీరినకొన్ననబోణీ నన్నురక్షించిన
పన్నగవేణీ ఉన్నతిగన్నరాణీ ॥ఏమి॥ ౧
జగములనెన్నఁడు మగనికిఁబ్రాణ మగణితగ
తినిచ్చుమగువనుఁగాన పొగడఁదగదెచాన ॥ఏమి॥ ౨

54 సావిత్రి—రాగము-బ్యాగ్ ఆదితాళము.

కొనియాడ నేల నన్ను ఘనముగాఁ జేసిచాల ||పల్లవి||

అంతఁగాఁ బొగడఁగా నెంతయుదగఁనుగా

ఇంత పెద్దఁ జేసితివిగ ||కొని|| ౧

మీపాదచింతఁ జేసి యేపారుదాసి

నేపాటినాదు వాసి ||కొని|| ౨

యము—రాగము-కల్యాణి ఆదితాళము.

సెలవిమ్మా పరమపావనీ ||పల్లవి||

వాసిగని మెనీ పాతివ్రత్యము

నీసరి యెవ్వరునుండరుగా సతులెందును ||సెల|| ౧

నీపతిఁ గూడుక నిఖిలైశ్వర్యము

వేపారఁగ సుఖయింపుమా ||సెల|| ౨

మ ం గ ళ ము.

56 రాగము-బిలహరి ఆదితాళము.

మంగళము సదా లలితరమా కులతరుణీ

కలితహారీ జయమంగళము

ధీరధరా భరణసునా శీరముఖా మరతరుణా

వనరుహాలోచనవలసత్ మునిజనితా వనచతురా

వినతాసుతవాహనపా పహరా మునిమానస

చర ఘనకరుణా సారాచారా సరసిజ భవ

శంకరముఖ సురనుత మంగళము సదా

సామజపా లనకరుణా ధామమహాంబుధిశయనా

భవజలజోద్భవసురపుంగవనుతమా భవత్రితతాం

భవరామకృష్ణకవిపూజితా నవమేఘవిదిత

సువిగ్రహరమానందారతిపతిజనకా

రమ్యపదా జయమంగము

—() సావిత్రీ చిత్రాశ్వనాటకము సమాప్తము. ()—

బళ్ళారి భువనేశ్వరి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.